2.12.1994 శుక్రవారం, 12 పేజీలు, సంపుటి : 66, సంచిక : 49, విడిప్రతి : రు. 2.00 లు

Phone : 27354. Regd No. HNL. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు    జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి



# రేసు గుర్రం వలె దౌడు తీసిన సైకిల్!

## జిల్లాలో ఎటు చూసినా పసుపు మబ్బుల ముసక చీకట్లే!

జిల్లాలో ఎన్నికల ఘట్టం ముగిసింది. నెల రోజుల పాటు అటు టిక్కెట్ల కోసం, ఇటు ఓట్ల కోసం హోరాహోరీ, ముష్టాముష్టి పోరాడి, నిద్రాహారాలు మాని, కాళ్లరిగేట్లు తిరిగిన అభ్యర్థుల జాతకాలు భద్రంగా బ్యాలెట్ పెట్టెల్లో నిక్షిప్తమైనాయి. రాజకీయ పార్టీలను, రాజకీయ వాదులను చట్టం పేరుతో చిత్ర హింసలు పెట్టి వినోదిస్తున్న శేషన్ హింసాలీలలో చివరి అంకంగా ఓట్ల లెక్కింపు ఆగిపోయింది కాని, లేకుంటే ఈపాటికి ఫలితాలూ తేలిపోయి వుండేవి. 9 తేది వరకు బుట్టలో పడుకున్న వాగుపాముల్లా ఓట్లు విశ్రాంతి తీసుకుంటాయి. ఆ రాత్రికి అభ్యర్థుల జాతకాలు తేలిపోతాయి.

శేషన్ ఆంక్షలు, వాటిని అమలు పరచడంలో కలెక్టర్ ఎం. సాంబశివ రావు గారి నిక్కచ్చి వైఖరి పుణ్యమా అని ఇటు ప్రచారం, అటు పోలింగ్ నిశ్శబ్దంగా, సందడి లేకుండా జరిగి పోయాయి. ఎక్కడా ఎటువంటి అవాంఛనీయ సంఘటనలూ జరగలేదు. అభ్యర్థులు వాహనాలు ఏర్పాటు చేయక పోయినా, ఓటర్లు పోలింగ్‌లో ఉత్సాహంగా పాల్గొన్నారు. పల్లెల్లో, పట్టణాలలో కూడా పేదలు అధిక సంఖ్యలో ఓటు వేశారు. వాహనాలు లేవు కాబట్టి, ఆ వర్గాల నుంచి పోలింగ్ తక్కువగా వుంటుందని వేసిన అంచనాలు వృధా పోయాయి. దూరం లెక్క చేయకుండా కాలి నడకన వచ్చి ఓట్లు వేసి వెళ్లారు వారు. స్వంత వాహనాలున్న ధనిక, ఎగువ మధ్య తరగతి ప్రజలే ఓటింగ్‌కు ముఖం చాటేశారనాలి. మహిళల ఓట్లు తక్కువగా వుండింది. వాహనాల రాకపోకలపై కూడా ఆంక్షలేమీ లేవు. తోకాడిస్తే తెగిపోద్ది జాగ్రత్త అన్నట్లు అధికారుల నుంచి హెచ్చరికలు రావడంతో అభ్యర్థులు, గ్రామాల్లోని వారి అనుచరులు దొంగ ఓట్లు, రిగ్గింగ్ దుస్సాహసాలు చేయలేక పోయారు గాని, లేకుంటే పోలింగ్ బూత్‌ల దగ్గరుండిన పరిస్థితులు వారికి వరం వలె ఉపకరించి వుండేవి. ఒక్క రాపూరు, ఉదయగిరిలలో తప్ప మరెక్కడా రిగ్గింగ్ యత్నాలు జరగలేదు.

శేషన్ ఎంత హుంకరించినా ధన ప్రవాహం మాత్రం ఆగలేదు. నెల్లూరు, కావలి టౌన్‌లలో డబ్బు పంపకం విచ్చల విడిగా జరిగింది. నెల్లూరులో కాంగ్రెస్ అభ్యర్థి డబ్బు వెదజల్లితే, కావలిలో తెలుగుదేశం కరెన్సీ నోట్లను చిత్తు కాగితాల వలె పంచింది. ఆత్మకూరు, రాపూరు, ఉదయగిరి, సూళ్లూరుపేట, అల్లూరు, వెంకటగిరి నియోజక వర్గాలలో కూడా ఎదురు బదురుగా కరెన్సీ పంపిణీ చేశారు.

వలసి వచ్చింది. కాళ్లు వాచిపోయి, నడుములు పట్టుక పోయి, పోలింగ్ నాటికి లేవలేని స్థితికి చేరారు చాలామంది అభ్యర్థులు. ఐదేళ్ల సుఖానికి ఆమాత్రం కష్ట పడడంలో జాలి పడాల్సిందేమీ లేదు లెండి!

ఈ ఎన్నికలలో విజయావకాశాల అంచనా ఏమిటి? చాలా ఇబ్బంది కరమైన ప్రశ్న ఇది. ఓట్లన్నీ పెట్టెల్లో వున్నాయి. ఎవరు ఏమి చేసినా మారేదేమీ లేదు. వాటిని లోపల పెట్టుకొని ఊహాగానాలు చేయడమంటే కత్తిమీద సాముతో కూడిన పని. ఎన్నికలకు ముందైతే ఏదైనా చెప్పవచ్చు. ఆ తర్వాత అంచనా తప్పయితే సమర్థించు కోవడానికి సవాలక్ష సాకులు దొరుకుతాయి. పెట్టెలో పెట్టి తాళం వేసిన ఓట్లను ఎవరికెన్ని పడ్డాయో చెప్పబోవడమంటే పెద్ద సాహసమే. కాని 8 రోజుల వ్యవధిలో అంచనాలు వేయకుండా వుండడం ఎవరి తరం? ఎవరికుంది అంత నిగ్రహం?

స్థూలంగా ఈ పోలింగ్ తీరును

ప్రచండంగా వీచిందన్న మాట నిజం. ఓట్ల లెక్కింపుకు వారం వ్యవధి వున్నా



బారులు తీరిన మహిళా ఓటర్లు;; వీరే కాంగ్రెస్ కొంప ముంచింది!

మేము ఈ అభిప్రాయాన్నే స్పష్టంగా వ్యక్తం చేస్తున్నాము. పోలింగ్ ఒక రోజు ముందు, పోలింగ్ రోజు మొత్తం 11 నియోజక వర్గాలలోనూ విస్తృతంగా తిరిగి, వందలాది ఓటర్లలో వ్యక్తిగతంగా మాట్లాడిన తర్వాత వచ్చిన అభిప్రాయమిది. అందువల్లే

సప్లిమెంట్‌లో ఏ అభిప్రాయమైతే చెప్పామో - ఇప్పుడూ అదే చెప్పవలసి వస్తున్నది. వెంకటగిరి, రాపూరు, ఆత్మకూరులలో మినహా మరెక్కడా కాంగ్రెస్ గెలుపును ఆశించటం అత్యాశే అవుతుందనిపిస్తున్నది. ఏదిఏమైనా ఆత్మకూరు ఇంకా కొంచెం అనుమానమే.

నెల్లూరు, ఉదయగిరి, కావలి, సూళ్లూరుపేట, గూడూరులలో తెలుగుదేశం విజయం ఖరారైనట్లే! సర్వేపల్లి, అల్లూరు, కోవూరులలో పోటీ తీవ్రాతి తీవ్రంగా వుంది. ఈ మూడింటిలో కూడా తెలుగుదేశం కొంచెం మెరుగ్గా వుండడం వాస్తవం. కానీ కాంగ్రెస్‌కూ గెల్చే అవకాశాలు లేకుండా పోలేదు.

పదకొండింటిలో తొమ్మిది స్థానాలలో కాంగ్రెస్ గెలుపు పట్ల సందేహం వ్యక్తం చేస్తే, ఖచ్చితంగా గెలుస్తారని చెప్పలేమని గణిగితే

## వెంకటగిరి, రాపూరు, ఆత్మకూరు మినహా మరెక్కడా కాంగ్రెస్ విజయం వూహించలేకున్నాము!

# ఎవరికీ పెద్ద మెజారిటీలు రాకపోవచ్చు!

ఏకపక్షంగా పోల్ కావడం చెప్పుకో దగిన విషయం. అన్ని నియోజక వర్గాలలో ఈ దృశ్యం ప్రముఖంగా కన్పించింది.

కలెక్టర్‌గారు తన ప్రకటనలు, ప్రచారంలో మరీ ఎక్కువగా భయ పెట్టారు గాని, వాస్తవంలో అంతటి నియమ నిబంధనలు, నియంత్రణలు కన్పించలేదు. పోలీసు తక్కువగా వుండడం వల్ల పోలీస్ బూత్‌ల దగ్గర జనం రాక పోకలను నియంత్రించే వారే లేరు. కొన్ని చోట్ల రద్దీగా,

డబ్బు పంపకంతో ఓటర్ల మనస్సులోని నిర్ణయం మారదన్న నిజం ఏ పాతిక, ముప్పయ్యేళ్ళ నాడే రుజువైంది. కాని మన నాయకులు, పార్టీలు ఎప్పటి కప్పుడు ఆ వాస్తవం విస్మరించి డబ్బుతో ఓటర్లను కొనుగోలు చేయాలని చూస్తుంటారు. ఫలితం తర్వాత కాని, తమ కంటే ఓటరెంత తెలివైన వాడో అర్థమై చావదు.

అభ్యర్థులు పగలు, రాత్రి తేడా లేకుండా పల్లెల్లు తిరిగి ఓట్లడగ

ఒక్కమాటలో విశ్లేషించి చెప్పాలంటే- సైకిల్ రేసు గుర్రం వలె దౌడు తీసిందని చెప్పాలి. జిల్లా అంతటా పచ్చటి పసుపు మబ్బులు క్రమ్ము కొన్నాయని వ్యాఖ్యానించాలి. పదకొండు నియోజక వర్గాలలోనూ అదే పరిస్థితి. కాంగ్రెస్ పట్ల ఆగ్రహం, ఎన్టీఆర్‌గారి రెండు రూపాయల బియ్యం పట్ల అనురక్తి ఓటర్లలో ప్రస్ఫుటంగా వ్యక్తమైనాయి. కాంగ్రెస్ వారలు కోపగించుకో వచ్చునేమో గాని, జిల్లాలో తెలుగుదేశం గాలి

అంత ధైర్యంగా చెప్ప గల్గుతున్నాము. రెండు, మూడు నియోజక వర్గాలలో అభ్యర్థుల వ్యక్తిగత విషయాలు, బలాబలాలు ప్రాధాన్యత సంతరించుకొని ఫలితం అనుకూలించిందే గాని ఒక పార్టీగా కాంగ్రెస్‌ను ప్రక్కకు నెట్టి, తెలుగు దేశాన్ని పీఠం ఎక్కించడానికి ఓటర్లు నిర్ణయం తీసుకొన్నారన్నది అర్థమౌతుంది.

పోలింగ్ ముందురోజు మేము వివరంగా చేసిన ప్రత్యేక ఎన్నికల

కాంగ్రెస్ వారలు మాపైన గయ్యమని విరుచుకు పడవచ్చు. కాని వ్యతిరేకాభిప్రాయం వల్ల గెలుపు, ఓటములపై ప్రభావం లేని పరిస్థితిలో మనసులోని నిజం చెప్పక పోవడం తప్పు కాదా? నిజం చెప్పవలసి వస్తే పరిస్థితి అదే!

### నెల్లూరులో రమేష్ రెడ్డి విజయంలో సందేహమా?

మేము మొదటినుంచి హెచ్చరిస్తూనే వున్నాం- నెల్లూరులో

కొనసా 2వ పేజీలో

విచిత్రము, విడ్డూరమైన పరిణామం

# కోవూరులో కాంగ్రెస్ గెలుపుకు దగ్గరగా వచ్చింది!

కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ వివి ప్రసన్న రెడ్డి తప్పు దారిన నడుస్తున్నారని; ధనిక వర్గం ప్రతినిధిగా ఆయన పట్ల ఓటర్లలో తీవ్ర ద్వేషాలు ప్రబలుతున్నాయని; రాజకీయ కార్యకర్తలను విస్మరించి, ఉద్యోగులు, బంధువులతో ప్రచారం నిర్వహించడం ప్రమాదమని; మైనారిటీస్ అసోసియేషన్ను, మాగుంట

మొదటిపేజీ కొరవ

యువసేనల పేరుతో అల్లరి చిల్లర మూకలు తలకు రిబ్బన్లు కట్టుకొని తందనా లాడడం ఓటర్లలో భయోత్పాతం సృష్టిస్తున్నదని! ఈ నాలుగు కారణాలే ప్రసన్న రెడ్డిని గెలుపుకు దూరం చేశాయి; రమేష్ రెడ్డికి అదృష్ట వరాలుగా వుపకరించాయి. టౌన్‌లో కాంగ్రెస్ గెల్చిపోయిందన్న ప్రచారం ముమ్మరంగా వున్న సమయంలో అది సరి కాదని చెప్పడం పెద్ద సాహసమే. ఈ విషయంలో మా పై వస్తున్న ఒత్తిడుల వేయలేరు. 30, 40 రూపాయల నోట్లు ఓటు స్లిప్ తీసుకొని లోపలకు వెళ్లిన వారు సైకిల్ మీద గుద్ది వచ్చారు. ఎసి స్టేడియంలో శ్రీకాకుళం ఆడ కూలీలు డామీ పని చేసినట్లు స్పష్టంగా చెప్పారు కూడా! పోలైన దొంగ ఓట్లు పందల్లో వుంటే, ప్రచారం వేలల్లో జరుగుతూంది.

ఆనం వారి వెన్నుపోటు బహిరంగంగానే వుండింది. ఆఖరి నిముషం వరకు నిశ్శబ్దంగా వుండిన వారు పోలింగ్ రోజు విశ్వరూపం ప్రదర్శించారు. ఆనం వారికి స్వయంగా గెల్చే బలం లేకున్నా, ఓడించే శక్తి ఇంకా మిగిలి వుంది.

టౌన్‌లో మహిళా ఓట్ల పోలింగ్ ఎక్కువ. వాటిలో అత్యధిక శాతం సైకిల్‌కే పడ్డాయి. రైలు కట్టకు తూర్పుగా బాలాజీనగర్, ఎసి నగర్, ఎన్టీఆర్ నగర్ వంటి ప్రాంతాలు, స్టోన్‌హౌస్‌పేట, నవాబుపేట, రంగనాయకులపేట, సంతపేట, మైపాడు గేటు, జాకిర్ హుసేన్ నగర్, కిసాన్ కాంగ్రెస్ పార్టీ గెలుపుకు దగ్గరగా వచ్చిందని చెప్పడం వింతగా తోచవచ్చు- గత ఉప ఎన్నికల్లో కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ పెళ్లకూరు రామచంద్రా రెడ్డి, తెలుగుదేశం, సిపిఎం ఓట్లు కలిపి చూస్తే 34 వేల భారీ తేడాతో అపజయం పొందారిక్కడ. కానీ ఇప్పుడీ విడ్డూరమైన, విచిత్రమైన ఈ పరిణామం సంభవించింది!

సులభంగా గెల్చి పోతామన్న ఆత్మ విశ్వాసంతో పోలింగుకు వారం రోజుల ముందు వరకు నల్లపరెడ్డి ప్రసన్న కుమార్ రెడ్డి కేర్‌లెస్‌గా తిరగడం; కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ వేమూరు దేవకుమార్ రెడ్డి గతంలో ఒకసారి ఓడినా, గ్రామాలలో కనీస పరిచయాలు, సంబంధాలు కొనసాగించడం; అతని పట్ల ఒకసారి ఓడించామన్న సానుభూతి ఏర్పడడం; ఇంకొక ప్రక్క మాగుంట సుబ్బరామ రెడ్డి, పెళ్లకూరు రామచంద్రా రెడ్డి వంటి పెద్ద పెద్ద వాళ్లంతా ఏకమై ఈ రోడ్లలోని గ్రామాలు మాత్రం మారలేదు. ఒక వది, పదిహేను శాతం మాత్రం కాంగ్రెస్‌కు పడ్డాయి. గతంలో పోలిస్తే అది గొప్ప!

34 వేల ఓట్ల భారీ తేడా కల్గిన నియోజక వర్గంలో, ఇప్పుడున్న తెలుగుదేశం గాలిలో కాంగ్రెస్‌ను గెలుపుకు దగ్గరకు తీసుక రావడం ఆశ్చర్య కరమైన విజయం. ఇక్కడా తెలుగుదేశం ఓడుతుందని చెప్పలేము. కానీ ఓడినా ఆశ్చర్యం లేదు; గెలిస్తే మెజారిటీ 3 వేలకు మించదు. తెలుగుదేశం 3 వేలతో గెలిస్తే, సాంకేతికంగా వారిది విజయమైనా, ప్రజాభిప్రాయం దృష్ట్యా కాంగ్రెస్‌దే గెలుపుగా పరిగణనౌతుంది; పెద్ద పెద్ద వాళ్లకు గుణపాఠంగా వుపకరిస్తుంది.

### జక్కా వెంకయ్యకే గెల్చే అవకాశం

1989 ఎన్నికల్లో జిల్లాలో కెల్లా మెజారిటీలో రెండవ స్థానం సంపాదించారు శ్రీ కాటంరెడ్డి

కానీ పరిస్థితులట్లే వున్నాయి. పోలింగ్ తర్వాత పరిస్థితి సమీక్షిస్తే ఫలితం ఆ ప్రకారం వుండడంలో ఆశ్చర్యమేమీ లేదనిపిస్తున్నది.

గ్రూపులు, గొడవల ప్రమేయం లేకుండా నగటు ఓటరు సిపిఎంకే ఓటు వేశాడిక్కడ. విష్ణుకు చాలా బలమైన స్థావర మనుకున్న దగదర్తి మండలం గ్రామాలలోనే ఆ పరిస్థితి స్పష్టంగా కన్పించింది. కావలి- బోగోలు మండలాలకు సంబంధించి ఒక్క గౌరవరం మినహా తతిమ్మా అన్ని ప్రదేశాలలో సిపిఎం ఆధిక్యత సాధించింది. అల్లూరు మండలంలో విష్ణుకు కొద్దిగా మెరుగు. అప్పుపల్లిలో పోలింగుకు రెండు రోజుల ముందు విష్ణుపై దాడి జరగడంతో, అది సానుభూతిగా మారి ఆ గ్రామాలలో విష్ణుకు మంచి ఓట్లే పడ్డాయి. కానీ, కంచుకోట వంటి అల్లూరు టౌన్ దెబ్బ తీసింది. బుచ్చి మండలంలోనూ కాంగ్రెస్‌కు ఓట్లు పడినా, సిపిఎం మరీ వెనక పడలేదు.

# జక్కా వెంకయ్యకూ గెల్చే ఛాన్స్ వుందంటే జిల్లాలో తెలుగు గాలి ప్రభావం వూహించవచ్చు!

తీవ్రత చూస్తే - రేపు మా అభిప్రాయం తలక్రిందులైతే తట్టుకోవడం కష్ట మన్పిస్తోంది. అయితే బూత్‌ల దగ్గర కళ్లకు కట్టినట్లు కన్పించిన వాస్తవ పరిస్థితిని చెప్పకుండట మెట్లా?

తెలుగుదేశం రమేష్ రెడ్డికి చాలా బూత్‌లలో ఏజంట్లే లేరని, వున్నవారు ప్రలోభాలకు లొంగిపోయారని, అందువల్ల కాంగ్రెస్ కార్యకర్తలు విపరీతంగా రిగ్గింగ్ చేశారని ఒక ప్రచారం విస్తృతంగా వుంది. ఇది దురభిప్రాయమే. టౌన్‌లోని ఏ బూత్‌లోనూ రిగ్గింగ్ జరగలేదు. విఆర్ హై స్కూలు, చిన్ని హోటల్ వంటి బూత్‌ల దగ్గర దొంగ ఓట్లు పోలైంది నిజం. కానీ, దొంగ ఓటు వేసిన వారందరూ కూడా కాంగ్రెస్‌కు నగర్ వంటి చోట్ల సైకిల్ జోరు కన్పడింది. ట్రంకురోడ్డుకు ఇటు అటు వున్న టౌన్ మధ్య భాగమంతా కాంగ్రెస్ బలం కన్పించింది. దర్గామిట్టలో చెరి సమంగా వుండినారు. ఉమ్మారెడ్డి గుంటలో హస్తం వెలుగులో వుండింది. ఏ రకంగా చూసినా కూడా రమేష్ రెడ్డి విజయం పట్ల సందేహం వుండ నవసరం లేదు. మెజారిటీ సైతం బాగానే వుండాలి. కాంగ్రెస్ సుస్థిరమైన స్థానం వంటి నెల్లూరు టౌన్‌లో దేశం విజయాన్ని చూడవలసి రావడం దురదృష్ట కరం.

### కోవూరులో విచిత్ర పరిణామాలు!

జిల్లా అంతా తెలుగు దేశం గాలి జోరుగా వీస్తుంటే, కోవూరులో పిల్లవాడ్ని ఓడించడానికి చూస్తున్నారనే నిరసన సన్న జనాలలో కల్గడం; దేవకుమార్ రెడ్డి ప్రచారార్భాటం లేకుండా ఇల్లిల్లు తిరిగి దీనంగా దండం పెట్టడం; ఆనం వర్గం దువ్వూరు, సంగం ఫిర్కాలలో మనస్ఫూర్తిగా పని చేయడం; సామంతు సుబ్బారెడ్డి, గోపాలరెడ్డి గారలు రైతులతో తమకున్న పరిచయాలను పూర్తిగా వినియోగించడం వంటి పరిణామాల వల్ల కోవూరులో విశేషంగా కాంగ్రెస్‌కు ఓట్లు పడ్డాయి. కోవూరు టౌన్, సంగం, దువ్వూరు, పరిసర గ్రామాలు, రామతీర్థం, పొన్నపూడి, ప్రాంతాలలో కాంగ్రెస్‌కు స్పష్టమైన ఆధిక్యత లభించింది. తెలుగుదేశానికి కంచు కోటలైన విడవలూరు, ఇనమడుగు

విష్ణువర్ధన్ రెడ్డి. అల్లూరు ఒక్కటే కాక, ఆ పరిసరాలలోని పదిహేను, ఇరవై గ్రామాలలో తరాల తరబడి తమ మాటకు ఎదురు లేకుండా చలామణి అయిన గౌరవ ప్రదమైన రాజకీయ కుటుంబం వారిది. విష్ణు వ్యక్తిగతంగా నిజాయితీ పరుడు, నిష్కపటి, జనంతో సంబంధాలు కల్గిన యువకుడు. గతంలో వలె ఈసారీ తెలుగు దేశం ఈ సీటును తమ మిత్ర పక్షమైన సిపిఎంకు కేటాయించింది. సిపిఎం అంటే సాధారణంగా, జక్కా వెంకయ్య అంటే ప్రత్యేకంగా రైతాంగానికి భయం వుంది. అందువల్లనే గతసారి తెలుగుదేశం పార్టీ సానుభూతి పరులు కూడా విష్ణు గెలుపుకు శ్రమించారు.

ఈ పరిస్థితులలో జక్కా వెంకయ్యకు గెల్చే అవకాశం వుందని, విష్ణు ఓటమి అంచులో వున్నాడని వ్రాయడం అసహజంగా కన్పడుతుంది.

జక్కా వెంకయ్య గారికే గెల్చే ఛాన్సు వచ్చిందంటే ఇక జిల్లాలో తెలుగుదేశం గాలి ప్రభావం అర్థం చేసుకోవచ్చు. దీనికి తగినట్లు వెంకయ్య గారు చాలా ఓర్పుగా ప్రచారం నిర్వహించారు. కాలి నడకన గ్రామ గ్రామం తిరిగారు. గతంలో చేసిన పొరపాటు పునరావృతం కాకుండా నియోజక వర్గానికి గట్టిగా పని చేస్తానని చెప్పారు. ఇంకొక ప్రక్క విష్ణుపై ప్రజలలో అసంతృప్తి వుండింది. తమ పట్ల సరైన శ్రద్ధ చూపలేదని, పని చేయలేదని ఓటర్లు తేటతెల్లంగా చెప్పారు. అనారోగ్యం వల్ల ఆయన గట్టిగా ప్రచారం చేయలేక పోయారు. ఇవి చాలవన్నట్లు మాజీ స్నేహితుడు మేడా అశోక్ రెడ్డి, మేనమామ అల్లంపాటి సీతారామి రెడ్డి విష్ణు ఓటమికి శపథం బట్టి పనిచేశారు. ఈ కారణాలన్నీ తోడై విష్ణును

కొరవ 9 పేజీలో

# శేషన్ కృషి ఫలించిందా?

భారత ప్రజాస్వామ్య చరిత్రలోనే ఒక నూతనాధ్యాయాన్ని, కొత్త వరవడిని సృష్టించిన ఛీఫ్ ఎలక్షన్ కమీషనర్ శ్రీ టి.ఎన్. శేషన్, ఎన్నికల సంస్కరణల కోసం చేసిన కృషి ఫలించిందా? మొండి వాడిగా, తిక్క మనిషిగా ముద్రపడి, రాజకీయ వాదులందరి చేతా చీవాట్లు తిని, ప్రజల చేత మాత్రం బ్రహ్మరథం పట్టించుకొన్న ఆయన పట్టుదల నెరవేరిందా? దేశంలోని అతి పెద్ద రాష్ట్రాలలోనివిగా గుర్తింపు పొందిన ఆంధ్రప్రదేశ్, కర్నాటకలలో పోలింగ్ పూర్తయిన తర్వాత ఈ ప్రశ్న వేయడంలో అనౌచిత్యమేమీ లేదు.

డబ్బు, గుండా యిజం, రాజకీయ ఔద్ధత్యం, అధికారుల అవినీతి, పలుకు బడులు, ప్రలోభాలు, పిరికి తనం వంటి సవాలక్ష అవలక్షణాలతో కుళ్లి పోయి, భ్రష్టు పట్టి వుండిన ఎన్నికల వ్యవస్థను చక్క దిద్దడానికి శేషన్ చేసిన కృషి అంతింత కాదు. ఇటు అధికారంలో వున్న ప్రభుత్వాన్ని, అధికార యంత్రాంగాన్ని; అటు పాలక, ప్రతిపక్ష పార్టీలను ఎదిరించి, పోరాడి మరీ చట్ట పరిధిలోనే ఎన్నికలను ఎంత ప్రజాస్వామ్య యుతంగా నిర్వహించ వచ్చునో నిరూపించి చూపారు శేషన్. అమలు చేసే అధికారిలో చిత్తశుద్ధి, తెగువ, అంకిత భావం, మొండి ధైర్యం వుంటే మన చట్టాలు ఎంతటి పటిష్టమైనవో ఆచరించి చూపారాయన. దశాబ్దాల తరబడి రాజకీయ వాదుల పెత్తనంలో, అవినీతి మత్తులో అశక్తులై పోయి వుండిన అధికార యంత్రాంగాన్ని తట్టి నిద్ర లేపారు.

ఈ పట్టుదల ప్రభావం ఈ ఎన్నికలలో మనం ప్రత్యక్షంగా చూశాం. జెండాలు అదృశ్యమై పోయాయి; బ్యానర్లు కన్పడకుండా మాయమైనాయి; కటౌట్లు అయిపు లేవు; పత్రికా ప్రకటనల ప్రస్తావనే లేదు; హోరుమనే మైకులు మూగవోయాయి; గోడల మీద వ్రాతలు వ్రాసే ధైర్యం ఎవరికీ కలుగలేదు; పార్టీ కార్యాలయపు దడబడలు లేవు; ర్యాలీలు, ప్రదర్శనల ఆర్భాటం లేదు; బరి తెగించి ఎన్నికల ప్రచారంలో పాల్గొనే ఉద్యోగులు, అధికారులు అభ్యర్థులకు ముఖం చూపించ డానికే హడలి చచ్చారు; ఎన్నికల సమయంలో గుళ్లు, గోపురాలు, బడులు, రోడ్లు, కుళాయిలు, బావులు అంటూ వాగ్దానాలు కురిపించే అభ్యర్థులు పదిమందికి బహిరంగంగా కాఫీ ఇప్పించ డానికి కూడా భయపడి పోయారు. మంత్రులు, ముఖ్యమంత్రుల స్థాయి నాయకులను నిలదీసే ధైర్యం సాధారణ గ్రామోద్యోగులు, పోలీసు కానిస్టేబిళ్లు కూడా సంతరించు కున్నారు. బాంబుల వీరులు, రిగ్గింగ్ శూరులు తోకముడిచారు.

ఎంతలో ఎంత మార్పు అని సగటు ఓటరు ముక్కున వేలేసుకొనే రీతిలో ఎన్నికలను నిర్వహించారు శేషన్. ఇది సాధారణ విజయం కాదు. మూడు నాలుగేళ్ల స్వల్ప వ్యవధిలో ఇన్ని మార్పులు, ఇంత భయం సృష్టించడం మానవ మాత్రుల కలివయ్యే పని కాదు.

అయితే బయటకు కన్పడే ప్రచారాన్ని నిరోధించడం, ఎన్నికల వ్యయ పరిమితిని కఠినంగా అమలు పరచడంతోనే శేషన్ కృషి ఫలించినట్లు పరిగణించాలా? కాదనే చెప్పాలి. శేషన్ సాధించిన ఈ విజయం మొత్తం ఎన్నికల సంస్కరణలో ప్రథమాంకం మాత్రమే! ఇంక పకడ్బందీగా, పటిష్ఠంగా ఎన్నికలు నిర్వహించి నప్పటికీ జరగ కూడని అనర్థాలు కొన్ని జరిగే పోయాయి. వాటిలో ప్రథమ మైనది - ధన ప్రభావం. ఎన్నికల వ్యవస్థలో నిజాయితీ, చట్ట బద్ధత లోపించి నందువల్లనే రాజకీయం కేవలం ధనవంతుల క్రీడగా గుర్తింప బడుతూ వచ్చింది. సేవా, త్యాగాలు కనుమరుగై; విధానాలు, సిద్ధాంతాలు తెరమరుగై; నీతి, నిజాయితీలు కరువై ఎన్నికలలో కేవలం



డబ్బున్నవారు మాత్రమే పాల్గొన గలడన్న దురభిప్రాయం ఏర్పడింది. అన్ని పార్టీలూ ఎవరైతే ఎక్కువ ఖర్చు పెట్టుకోగలరో అంచనా వేసి అభ్యర్థులుగా నియమిస్తున్నాయి. వారు ఎన్నికల్లో గెల్చి మరింత అవినీతికి పాల్పడి, మరిన్ని ఘోరాలు చేసి, మళ్లీ ఎన్నికలకు మరింత ధనం పోగు చేసు కొంటున్నారు. శేషన్ ఎంత పెనుగులాడినా ఈ ధనస్వాములు ఈ ఎన్నికలలోనూ దొంగ చాటుగా డబ్బు వెదజల్లారు. లక్షలకు లక్షలు, కొన్ని చోట్ల కోట్లు కూడా క్రుమ్మరించారు. అధికారులు వెయ్యి కళ్లతో పరికించి చూసినా అంతు చిక్కకుండా జరిగి పోయింది దుర్మార్గం. డబ్బున్న వాడే ఎన్నికలలో నిలబడి గలడన్న నానుడిని వీరు పరోక్షంగా నిజం చేశారు. అది చూసిన తర్వాతే సందేహం కల్గింది - ప్రచారార్భాటం తగ్గించడంతోనే శేషన్ కృషి ఫలించినట్లేనా అని!

డబ్బు, అధికార దుర్వినియోగం, గుండాయిజం వంటి అవలక్షణాలను కేవలం చట్టాలు నివారించ లేవు; ఒక్క శేషన్ ఏమీ చేయలేరు. అందుకు ప్రజల సహకారం కావాలి! పై మూడు అక్రమ మార్గాలలో ఓట్లను రాబట్టు కోవడానికి ప్రయత్నించే వారిని ఓటర్లే త్రిప్పి కొట్టాలి. అప్పుడు గాని ఎన్నికల వ్యవస్థ నిజంగా సంస్కరింప బడదు; సామాన్యుడు ప్రజలకు ప్రతినిధిగా వుండడానికి అవకాశం లభించదు. ఆ రోజు త్వరలోనే వస్తుందని ఆశిద్దాం!



1-12-1944

పేజీలు:8 వెల: 0-1-6

## పెన్నలో పడవమునిగింది

ఈ మధ్యాహ్నం 40 మందికి పైగా యెక్కిన ఒక పడవ నెల్లూరు వద్ద పెన్నలో మునిగింది. చాలా మంది రక్షింపబడినారు.

సా 3-30 గం

### అవీ-ఇవీ

గూడూరు స్పెషల్ డిప్టికలెక్టరుగారు అంగ వంగ కళింగ దేశాలన్నీ చిత్తమని చంపుతాడని జవానులు లెట్టిన అర్జీని కలెక్టరు చిత్రగించి ఇదంతా అబద్ధమని తోసివేశారట.

* * *

శ్రీ ధరణికోట సుబ్రహ్మణ్యం, తూములూరు శివరామయ్య పంతులుగారలు స్వర్గీయ ధరణికోట వరలక్ష్మమ్మగారి జ్ఞాపకార్థం ప్రొగ్రెసివ్ యూనియన్ వారికి ఒక పెద్ద బీరువాయును, 140 అమూల్య గ్రంథాలను బహూకరించిరి.

విద్యావినయ సంపన్నయగు వరలక్ష్మమ్మ గారు శివరామయ్య తనయ కస్తూరిదేవి విద్యాలయంలోని విద్యనభ్యసించింది. కావున, ఆమె పేరుతో ఆ విద్యాలయంలో శాశ్వతధర్మం ఏమన్నా చేయమని మా సలహా.

మాటలో మాట:- ఎప్పుడో ... వ్యామోహంలో విద్యార్థులు నిమగ్నులైయున్న దినాలలో విశాఖపట్నంలో పెద్ద వకీలుకు "హ్యామ్‌శాస్త్రి" అని పేరు బెట్టుకొన్నట్లు యీ సంఘానికిగూడా "ప్రొగ్రెసివ్ యూనియన్" అని ఆంగ్ల నామకరణం చేశారు. యీ పేరు జాచి చాలామంది దూరదూరంగా పోతున్నారు వ్యవసాయశాస్త్ర పారంగతుడైన డి.యం.కె.రెడ్డి గారి సూటు హ్యాటు

**50 ఏళ్లక్రితం ఈవారం**

జాచి రైతులు దూరంగాపోయి నట్లు అలా గాకుండా కమ్మటి తెనుగు పేరేదైనా పెట్టమని నాగుడ్డి సలహా.

* * *

పెటెటొట్టిగారు గత 13తేది చక్కిరాల గోపాలు బ్రదర్సు వారికి 12 గ్లూకోస ఫొట్లాలు యిచ్చారట. అప్పుడే పోల్ స్టేషన్ అసిస్టెంటు మాస్టర్ వెళ్లి చక్కిరాలనడిగితే 'కబంధంనామరూపేణా' అని ఉత్తనోరు చూపారట. మొత్తానికి వీరంగంటికి గ్లూకోస్ డబ్బాలు ఎన్నివందలు దిగినా అంగట్లో ఏదో మహాశక్తి వుందట, అది గుటుక్కున మ్రింగికూర్చుంటుంది. రామమూర్తి మంత్రం దాన్ని ఏమీ చేయలేదట. భీమ ఆ శక్తి ఎలాంటిదో

### నెల్లూరు అధికార్ల మార్పులు

కె. సుందరేశం, షేక్ దస్తగిరి సాహెబ్, బి హనుమంతరావు, ఆర్. నరశింహులు శెట్టి, రామమూర్తి పంతులు గార్లను విశాఖపట్నం ఎగుమతిచేశారు.

# ఎన్టీఆర్ వెకిలి చేష్టలతో ఆంధ్రుల పరువు పోతూంది!

శాసనసభ ఎన్నికల కోసం ఎన్టీఆర్ నిర్వహించిన ప్రచారం ప్రజలను ఆశ్చర్య పరిచింది. ఆయన సతీ సమేతంగా ప్రచారానికి వస్తే వచ్చారు గానీ, పర్యటనలో ఆయన వేసిన వేషాలు, చేసిన వెకిలి చేష్టలు అమిత జుగుప్సాకరంగా వుండాయి. ఆయన నెల్లూరు బహిరంగ సభలో ప్రసంగిస్తున్నపుడు కొందరు పిచ్చి అభిమానులు టోపీ పెట్టుకోమని అరవడం, అది ధరించగానే వేటగాడని అనగానే అన్నగారు రెచ్చిపోయారు. వెంటనే లక్ష్మీ పార్వతి కన్ను గీటి, తలపై చేయివేసి, మరో చేయి నడుముపై వేసి నిమరడం అసహ్యంగా వుంది. ఆయనగారి ధోరణి చూస్తుంటే ప్రజలు కోరారని చైతన్య రథంపైనే ప్రణయ కలాపాలు సాగించేలా వున్నాడు. కొందరు ఎన్టీఆర్ వెర్రిమొర్రి చేష్టలకు జేజేలు పలకడం వల్లే ఈ విధంగా చేస్తున్నట్లున్నాడు. సర్కస్ బఫూన్‌లా ఆయన చేష్టల వల్ల ఆంధ్రుల గౌరవం దిగ జారుతుందని ఆ నేత గ్రహిస్తే మంచిది.

గూడూరు -వంగా ప్రసాద్‌రెడ్డి

## జనవాణి

### రేడియో నాటకం బాగుంది!

నాటకోత్సవాల సందర్భంగా ఇటీవల విజయవాడ రేడియో కేంద్రం ప్రసారం చేసిన 'చిక్కు ప్రశ్న' నాటకం ఎంతో బాగుంది. హిందీ నుంచి నాటకాన్ని విజయవాడ స్టేషన్ డైరెక్టర్ దుర్గాభాస్కర్ తెలుగులోకి అనువదించారు. ఇతర భాషల నుంచి ముఖ్యంగా నాటకాలను తెలుగులోకి అనువదించి మెప్పించటం అంత సులభ సాధ్యం కాదు. అలాంటి అసాధ్యాన్ని సుసాధ్యం చేసుకొని 'చిక్కుప్రశ్న' నాటకాన్ని దుర్గాభాస్కర్ సుబోధక మైన రీతిలో అనువదించి రసవత్తరం చేశారు. సూటిగా, సరళంగా సాగింది అందమైన ఆమె రచనా శైలి. ప్రతి పాత్రకు స్వాభావికమైన సంభాషణలు విశిష్టమైన ప్రవర్తన అలవరచారు. మృత్యువుకు సంబంధించిన నిగూఢ సత్యాన్ని పరిశీలించిన పోకడ బాగుంది.

కొరవ 8 పేజీలో.

# పోలీస్‌కంటికి కన్పించకుండాపోయిందేమి?

శేషన్ నిబంధనల బూచి చూపిస్తూ ప్రచారార్భాటంతో రాజకీయ పార్టీలను, ప్రజానూ తెలివిగా బోల్తా కొట్టించారు. కలెక్టర్ గారు పోలీసుల ప్రమేయమే లేకుండా ఎన్నికలను ఏ గొడవా లేకుండా నిర్వహించేశారు. గురువారం జిల్లాలో మెజారిటీ పోలింగ్ కేంద్రాల్లో కనీసం ఒక్క పోలీసు కూడా లేకపోవడం చూసి ఓటర్ల తోపాటు ఓటింగ్ తీరు పరిశీలించేందుకు వెళ్లిన విలేఖరులూ ఆశ్చర్య పోయారు. ఎస్పీ చెప్పినట్లు 144 సెక్షన్లు, పోలింగ్ కేంద్రాలను సందర్శించే మెరుపు దళాలు, సంచార దళాల పునికి అసలు కనపడ లేదు. చెక్ పోస్టుల వద్ద సోదాలే లేవు. అట్లని పెద్ద ఎత్తున వాహనాలు తిరిగాయంటే అదీ లేదు. ముందుగా చేసిన ప్రకటనలు, చేసిన హెచ్చరికల వల్ల ఎక్కడి కక్కడ వాహనాలు భయపడి ఆగిపోయాయి. ధైర్యం చేసి తిరిగిన వాటిని ఒకటి, రెండు చోట్ల తప్ప ఆపి అడిగిన నాథుడే లేడు. సాఫీగా పోలింగ్ నిర్వహణకు జిల్లాలోని మొత్తం పోలీస్ సిబ్బంది తోపాటు పెద్ద ఎత్తున సిఆర్‌పిఎఫ్, పారా మిలిటరీ, ఆర్‌పిఎఫ్, ఏపి ఎస్‌పి రిక్రూట్స్, అటవీ శాఖ దళాలను వుపయోగించు కొంటామని ఎస్.పి. రమణ మూర్తిగారు ఎన్నికల ముందు చెప్పారు. ఈ పేర్లన్నీ విని రాజకీయ పార్టీలు, ప్రజలు మొత్తం నియోజక వర్గాలు పోలీసు దిగ్బంధనంలో వుంటాయేమోనని హడలి చచ్చారు. తీరా ఆచరణలో జిల్లా మొత్తంలో మోహరించిన పోలీసుల సంఖ్య కేవలం 3,500మాత్రమే. పోలింగ్ బూతుల

> జనం పోలీసు వైఫల్యం అనుకున్నారు; కాని అది పథకం ప్రకారం జరిగిందే నంటున్నారు అధికారులు

సంఖ్య 2,309. సరాసరిన బూత్‌కు ఇద్దరు కానిస్టేబుళ్లను పెట్టడానికి ఈ బలం చాలదు. అందువల్ల శాంతియుత బూత్‌లనుకొన్న దగ్గర అసలు పోలీస్‌ను ఎత్తివేసి, ఉద్రిక్తత లుంటాయన్న దగ్గర మాత్రమే మోహరింప జేశారు. దానితో పోలీసు కన్పడ లేదన్న విమర్శ సర్వత్రా విన్పించింది. ఆత్మకూరు, రాపూర్, ఉదయగిరి నియోజక వర్గాల్లో 70 - సమస్యాత్మక గ్రామాల్లో దృష్టి కేంద్రీకరించి చేతిలో వున్న పోలీసునంతా అక్కడికి తరలింప జేశారు. మిగతా చోట్ల నామ్‌కే వాస్తె అక్కడక్కడ టోపీలు కనపడేట్లు చేశారు. భారీగా, పోటా పోటీగా పోలింగ్ జరిగిన నెల్లూరులో బందోబస్తు సరిగ్గా లేకపోవడం వల్లే అక్కడక్కడా గొడవలు జరిగాయి. రాపూరు, అల్లూరుల్లోనూ అంతే. పెద్ద సంఖ్యలో ఓట్లు వేయను ప్రజలు తరలి వచ్చిన పందల్లూరు, చిలమానిచేను, ఆర్మేనిపాడు, తిరుమల పూడి, ముమ్మాయ పాళెంలో పోలింగ్ కేంద్రాల వద్ద అధికారులే ఓటర్లను 'క్యూ' లో నిలబడమని అభ్యర్థిస్తూ కనపడ్డారు. ఓటర్లలో కూడా ఈసారి ఎక్కడలేని మార్పు స్పష్టంగా కనపడింది; గ్రామీణ ప్రాంతాల్లో గంటల తరబడి ఓటర్లు బారులు తీరిన 'క్యూ'లలో నిలబడి ఓపికగా ఓటేసి వెళ్లారు. జిల్లా వ్యాప్తంగా పోలింగ్ బూతుల్లో పోలీసులు లేని విషయమై విమర్శ చెలరేగింది. కాని వున్న సిబ్బందితోనే సర్దుకు పోవాలన్న ఎత్తుగడతో కలెక్టర్, ఎస్పి తెలివిగా పథకం రచించారు. సక్సెస్ అయ్యారు. ఈ విషయమే ముందు తెలిసివుంటే రాజకీయ పార్టీలు మరో రకంగా వ్యూహాలు రచించి వుండేవేమో... పాపం ఛాన్స్ మిస్.

# సామాన్యుడికర్థమయ్యేభగవద్గీత!

> గ్రంథసమీక్ష - డాక్టర్ ఉడాలి నరసింహామూర్తి

భారతీయ వాఙ్మయంలో భగవద్గీతకున్న ప్రాముఖ్యం మరే గ్రంథానికి లేదు. కురుక్షేత్రంలో యుద్ధ విముఖుడైన అర్జునుడికి రథసారథ్యమే కాకుండా జ్ఞాన సారథ్యం వహించి శ్రీకృష్ణ భగవానుడు చేసిన ఉపదేశం భగవద్గీత. సంశయగ్రస్తుడైన అర్జునుడి ఆర్తి తొలగించి సంసార దుఃఖాన్ని పూర్తిగా రూపుమాపే ఆత్మజ్ఞానాన్ని అతనికి ఉపదేశించాడు శ్రీకృష్ణపరమాత్మ. భగవద్గీత శ్లోకాలు అర్థమవుతున్నట్లే ఉంటాయి. కాని దాని తత్త్వం మనకు దురవగాహం. గీతలోని ప్రతిశ్లోకం ప్రతి అక్షరంలో దైవత్వం భాసిస్తుంది. పఠన పాటవంతో చిత్తశుద్ధి యేర్పడే కొలదీ అందు సరిక్రొత్త అర్థాలు గోచరిస్తుంటాయి.

గీతకు ఎందరో వ్యాఖ్యానాలు, భాష్యాలు వ్రాశారు. అనువాదాలు చేశారు. ఎవరు ఎన్ని రకాలుగా చేసినా అందులోని అనంత విజ్ఞానం మిగిలి వున్నట్లే కనబడుతుంది. సమకాలీన సమాజంలో శాంతియుత సహజీవనానికి ఆచరణ యోగ్యమైన నియమాలను అందించేది భగవద్గీత. కాబట్టి గీత మానవ సమాజానికి సమగ్ర జీవన వ్యవస్థను అభ్యుదయ ప్రణాళికను ఇస్తుందనడం సత్యదూరంకాదు.

"గీతాసుగీతాకర్తవ్యాకిమన్యైః శాస్త్రవిస్తరైః" అన్న సూక్తి ప్రకారం సమస్త శాస్త్రాలలో నిబద్ధమయిన సారమంతా గీతలో యిమిడి వుంది. గీతలో భక్తి, జ్ఞాన, కర్మయోగాలు ప్రధానాలు. మిగతావి తదంగములని భాష్యకారుల అభిప్రాయం. గీతలోని ఉపదేశాలు వినేందుకు ఎంత సరళములో ఆచరణలో అంత కష్టసాధ్యములు. జీవిత కాలమంతా వెచ్చించినా అంతుపట్టని లోతు అందులో వుంది.

అందుచేత "సర్వోపనిషదో గావోదోగ్ధాగోపాలనందనః పార్థోవత్స సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్" అని సర్వ ఉపనిషత్సారముగ గీత ప్రఖ్యాతమై సర్వశాస్త్రమయంగా పరిగణింప బడుచున్నది.

అట్టి ఉత్కృష్ట గ్రంథాన్ని శ్రీమద్భాగవత చంద్రికయను పేరుతో శ్రీభట్టారం రాధాకృష్ణయ్యగారు అనువాదం చేశారు. గ్రంథాన్ని కృష్ణపరమాత్మకు అంకితం చేశారు. రచయిత పదవీ విరమణ చేసిన ప్రభుత్వోద్యోగి. గీతాహృదయాన్ని వశం చేసుకొని అనువక్త అనువాదాల్ని మూలవిధేయంగా సరళపద గుంభనతో సరస కవితా శైలిలో చేయుట ప్రశంసనీయం. వృత్తి వేరైనా ప్రవృత్తిలో చక్కగా రాణించే వార్లలో రాధాకృష్ణయ్య ఒకరు.

"జీవనది గీత రతయి చేతగారు" అని అవతారికలో తన వినమ్రత ప్రకటించుకొన్నారు. కృష్ణ భగవానుని గీతా గంగోదకాన్ని లోకంలో అనువాద రూపంగా

(కొనసాగి 8 పేజీలో)



# శేషుగుడు

## * రాజకీయవైధవ్యంసిద్ధింప జేయడానికి మేగోరె అవిరళకృషి

సంసార జీవితంలో వున్నట్లే ప్రజా జీవితంలోనూ వైధవ్యం వుంటుంది. దాంపత్య జీవనంలో అర్ధాంగిని కోల్పోయిన వారెట్లా దిగులుపడి, కుమిలి పోతారో; రాజకీయ జీవితంలో పదవి పోగొట్టుకున్న వారూ అంత కంటే ఘోరంగా బాధపడి, క్రుంగి పోతుంటారు. ఎన్టీరామారావు వంటి సంస్కార హీనులు తప్ప, దాంపత్య జీవితంలో మళ్లీ పెళ్లికి తలపడరు; కాని రాజకీయ వాదులు మాత్రం పదవికి గ్రాద్ధం పెట్టిన ప్రక్క క్షణంలోనే కొత్త పదవికి వెంపర్లాడుతారు. కొందరికి ఈ పునః బదవతనం సంప్రాప్తిస్తుంది; కొందరు జీవితాంతం ఏ పదవీ పొందలేని అనర్హతతో రాజకీయ విధవలుగానే కాలం గడుపు తుంటారు.

నెల్లూరు జిల్లా రాజకీయాలలో రాజకీయ వైధవ్యం కల్గిన వారిలో సీనియర్ మోస్ట్ నాయకుడు మేగోరె. ఆనాటి ముఖ్యమంత్రి చేసిన పొరపాటు వల్ల తప్పిదారి ఆయనకు జిల్లా పరిషత్ ఛైర్మన్ పదవి లభించింది.

### డోలేంద్ర

అది పోయినప్పటి నుంచి ఆయన వైధవ్యంతో పదవి లేని ఒంటరి జీవితం నిరామయంగా గడుపు తున్నారు. రాజకీయాలలో వుండే వారికి నిజంగా నరక తుల్యమే అది. కాని కాలం కలిసి రానప్పుడు అనుభవించక తప్పదు కదా? హాయిగా పడక కుర్చీలో ఆసీనుడై, వేడి వేడి బజ్జీలు, మసాల వడలు తింటూ, తన దగ్గరకు వచ్చే

(మిగతా 7 పేజీలో)

# మీ కీర్తి మూర్తికి శిరసు వంచి నమస్కరిస్తాం!




మీ సేవా త్యాగాలే శ్రీరామ రక్షగా
మీ మమతానురాగాలే పెట్టని కోటగా
మీ ఆదర్శాలే శిరోధార్యంగా
మీరు చూపిన బాటయే శరణ్యంగా
చిత్తశుద్ధితో లక్ష్య సిద్ధితో పయనిస్తూ
మీ కీర్తిని అజరామరం చేస్తాం.

మీ మనుమడు
Rtn. బెజవాడ నరేష్‌చంద్రా రెడ్డి

# ARPITA *Villa*

a unique Residential Apartment Complex, which is....

✓ Conveniently & centrally located at RED LANDS, DARGAMITTA, NELLORE - exactly behind M.G.Brothers.

✓ With various sizes of 2 & 3 Bedroomed Apartments (Ceramic Tiled Flooring) to suit various BUDGETS.

నిశ్చింతగా -సౌకర్యంగా-సుఖంగా మీ అపార్ట్‌మెంట్‌లో మీరు జీవనం సాగించేందుకు "అర్పిత విల్లా" అధునాతన పద్ధతులు ప్రవేశ పెట్టింది. మేము అమర్చిన సౌకర్యాలలో క్రింద తెలుపుతున్నవి కొన్ని మాత్రమే..

- మీకు వెసలు బాటున్నప్పుడు ఆరోగ్యాన్ని మెరుగు పరచు కొనేందుకు మేము కల్పించిన సదుపాయం "జిమ్" (GYM).
- మరో సదుపాయం పిల్లలకై మాచే ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన క్రీడా మైదానం. ఆటలలో మైమరచి వున్న పిల్లలను మీ అపార్ట్‌మెంట్ నుండే గమనించు కోగల కోణంలో ఆట స్థలం ఏర్పాటు.
- అందరికీ అత్యంత అవసరమైనది మేము ఏర్పాటు చేసిన అధునాతనమైన టెలిఫోన్ సౌకర్యం. ఇంటిలో నుండి కాలుబయట పెట్టకుండా సుదూర ప్రాంతాలలో వుండే వారితో సైతం- అలాగే బయట వారు మీతో పరస్పరం మాట్లాడుకునేందుకై EPABX.
- వంట గదిలో వంట చేసేప్పుడు గాలిలో ఏర్పడే కాలుష్యం ఇల్లంతా ఆవరించకుండా మంచి వాతావరణంలో ఉత్సాహంగా వంట పూర్తి చేసుకొనేందుకు "చిమ్నీ" ఏర్పాటు.
- పొరపాట్లు జరగటం మామూలే, విద్యుత్‌తో చెలగాటం ప్రాణాలకే ముప్పు. అలాజరగకుండా "యాంటీ షాక్ డివైజర్" ద్వారా కరంటు నుండి పరిపూర్ణ రక్షణ.
- కరంటు పోతుందన్న భయంలేదు. చీకటి కాంప్లెక్సను ఆవరించకుండా ఏర్పాటు చేసివున్నాం "సోలార్ పవర్ ఎమర్జెన్సీ ల్యాంప్"ల ద్వారా. ఈ ఏర్పాటు చీకటిని ఒక్క సెకండు కాలంకూడా కాంప్లెక్స్ ఆవరణ లోనికి చేరనీయదు.
- రోజులో ఏ సమయంలోనైనా కొళాయి త్రిప్పితే వేడినీరు. ప్రత్యేకంగా మీరు "గీజర్సు" "హీటర్స్" ఏర్పటు చేసుకోవలసిన అవసరం లేదు. మేము "సోలార్ పవర్" ద్వారా కాంప్లెక్స్ మొత్తానికి కలిగిస్తున్న అత్యంత ఆధునిక సౌకర్యం."సోలార్ పవర్" ద్వారా సరఫరా చేయబడేనీరు 75డిగ్రీల వేడివుంటుంది. త్రాగునీటికై మీరు ఈ నీటిని వేడిచేసుకునేందుకు కొద్ది ఇంధనం ఖర్చు చేస్తే చాలు. కొద్ది సమయంలోనే సోలార్ వేడినీళ్ళు "స్టెరిలైజ్‌డ్" మంచినీరుగా మారిపోతుంది. అంతేకాక మీరు గుర్తించవలసింది - వేడినీటికై అదనపు కరంటు ఖర్చు భరించవలసిన అవసరం ఉండదు.
- విద్యుత్ ప్రవాహంలో హెచ్చు తగ్గుల వల్ల ఫ్యూజ్ పోతుందన్న అందోళన మీకు ఉండదు. స్విచ్ నొక్కగానే కరంటు ప్రవాహాన్ని క్రమ బద్ధీకరించగల "MCB ట్రిప్ స్విచ్" ఏర్పాటు.

చీకూ-చింతా లేకుండా జీవనం గడపడానికి ఇలాంటివే మరెన్నో సౌకర్యాలు - మా ద్వారా మీకు.

**We believe in providing you the BEST.**



**SAI SARITA ESTATES PRIVATE LIMITED**
20 & 21, RED LANDS, DARGAMITTA,
NELLORE-524 003. Ph:22044 (R) 22138.

# నెల్లూరు [illegible]

విశ్లేషకుడు

## తెలుగుదేశం గాలి లేదు, ధూళి లేదు!

నెల్లూరు జిల్లాలో తెలుగు దేశం గాలి వీస్తుందన్న అభిప్రాయాన్ని మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్ధన రెడ్డి తిరస్కరిస్తున్నారు. తెలుగుదేశం గాలి అంటూ వుంటే వుంటే కనీసం పోలింగ్ తర్వాతైనా బయటపడి వుండాలని, ఇప్పటి వరకు ఓటరు నుంచి అటువంటి సూచనే లేదని చెప్తున్నారాయన. గూడూరు నియోజక వర్గంలో కాంగ్రెస్ గెలుస్తుందన్న విశ్వాసాన్ని వ్యక్తం చేశారు. జిల్లాలో అత్యధిక సీట్లు కాంగ్రెస్ పరమౌతాయని భావిస్తున్నట్లు చెప్పారు.

## తెలుగుదేశం ధీమా

జిల్లాలో పదకొండు స్థానాలూ మావే నంటున్నారు తెలుగుదేశం జిల్లా కన్వీనర్ శ్రీ సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి. మెజారిటీ కూడా ఏ నియోజక వర్గంలో 10 వేలకు తగ్గదని వారి నమ్మకమట.

ఆయనకు కొంచెం అతిశయోక్తులు చెప్పే బలహీనత వుందిలెండి!



## ఓటింగ్‌తీరు

జిల్లాలోని 11 నియోజక వర్గాలలోని 16,38,898 ఓట్లకుగాను 11,67,041 పోలయ్యాయి. అన్నిటికంటె ఎక్కువగా 79.8 శాతం వెంకటగిరి నియోజక వర్గంలో ఓట్లువేయగా, జిల్లాలో అత్యధికంగా ఓటర్లున్న నెల్లూరులో మాత్రం అతి తక్కువగా 61.84శాతం మంది తమ ఓటు హక్కు వినియోగించు కున్నారు. సర్వేపల్లి నియోజక వర్గంలో అత్యధికంగా మహిళలు; నెల్లూరులో అధిక సంఖ్యలో పురుషులు పోలింగ్‌లో పాల్గొన్నారు. ఆ వివరాలు క్రింద యిస్తున్నాం.

| నియోజక వర్గాలు | మొత్తం ఓట్లు | పోలైన ఓట్లు | పురుషులు | స్త్రీలు | పోలింగ్ శాతం |
|---|---|---|---|---|---|
| ఉదయగిరి | 1,23,883 | 84,788 | లెక్క తేలలేదు | లెక్క తేలలేదు | 68.4 |
| కావలి | 1,52,225 | 1,06,799 | 55,070 | 51,729 | 70.15 |
| అల్లూరు | 1,31,553 | 90,775 | 46,023 | 44,752 | 69.08 |
| కోవూరు | 1,35,118 | 94,277 | లెక్క తేలలేదు | లెక్క తేలలేదు | 70.0 |
| ఆత్మకూరు | 1,47,374 | 1,08,449 | 55,196 | 53,253 | 73.3 |
| రాపూరు | 1,54,415 | 1,15,361 | 59,906 | 55,455 | 74.66 |
| నెల్లూరు | 2,03,645 | 1,25,927 | 65,427 | 60,500 | 61.84 |
| సర్వేపల్లి | 1,49,745 | 1,11,178 | 58,039 | 53,139 | 73.4 |
| గూడూరు | 1,58,726 | 1,12,063 | 58,066 | 79,905 | 70.6 |
| సూళ్లూరుపేట | 1,42.117 | 1,05,593 | 54,361 | 51,232 | 74.25 |
| వెంకటగిరి | 1,39,957 | 1,11,831 | 57,304 | 54,527 | 79.8 |

### రీ పోలింగ్‌లు

జిల్లాలోని రెండు నియోజక వర్గాలలోని రెండు పోలింగ్ కేంద్రాలలో ఈ రోజు (1తేది) రీపోలింగ్ జరుగుతూంది. ఉదయగిరి నియోజక వర్గం రెడ్డదిన్నె గ్రామంలో తెలుగుదేశం పార్టీ వారు బ్యాలెట్ పెట్టెను ఎత్తుక పోయి, బావిలో వేశారు. ఆత్మకూరు నియోజక వర్గం అశ్వనీపురంలో స్కూటర్ మీద వచ్చిన ఇద్దరు గుర్తు తెలియని వ్యక్తులు పోలింగ్ బూత్‌లోకి దూరి 70 బ్యాలెట్ పత్రాలు పెరుక్కొని చించేశారు. ఈ రెండు పోలింగ్ కేంద్రాలలో ఈ రోజు రీపోలింగ్ జరుగుతూంది.

అశ్వనీపురంలో ఓటుకు రెండు వందల లెక్కన బేరం జరుగు తున్నదట.

### కౌంటింగ్ కేంద్రాలు

నెల్లూరు జిల్లాలోని 11 నియోజక వర్గాలలో ఓట్ల లెక్కింపు 9 తేది ఉదయం 8 గంటలకు ప్రారంభ మౌతుంది. అర్ధరాత్రికి కాని పూర్తి ఫలితాలు వెలువడవు.

ఉదయగిరి, కావలి ఓట్ల లెక్కింపు కావలి ఎబిఎం జూనియర్ కాలేజిలో; అల్లూరు, కోవూరు - నెల్లూరు పాలిటెక్నిక్ కాలేజిలో; ఆత్మకూరు - నెల్లూరు ఎసి స్టేడియంలో; రాపూరు నెల్లూరు, సర్వేపల్లిల ఓట్లు డిఆర్ డబ్ల్యు కాలేజీలో; గూడూరు - డిఆర్ డబ్ల్యు కాలేజిలో; సూళ్లూరుపేట స్పేస్ రిక్రియేషన్ హాల్‌లో; వెంకటగిరి మండల ప్రజా పరిషత్ హాల్‌లో ఓట్ల లెక్కింపు జరుగుతూంది.

### 99 శాతం పోలింగ్

సూళ్లూరుపేట నియోజక వర్గం తడ మండలం కాదలూరు గ్రామంలో 99.54 శాతం పోలింగ్ జరిగింది. 651 ఓట్లకు 648 పోలైనాయి. ఈ గ్రామం - మంత్రి శ్రీ పసల పెంచలయ్య వియ్యంకుడి స్వగ్రామం.

### మందు మాయం- కలెక్టర్ విజయం!

ఎన్నికల సమయంలో డబ్బు పంపకాన్ని నిరోధించడంలో విఫలమైన జిల్లా యంత్రాంగం - సారాయి, చీప్ లిక్కర్ ప్రవాహాన్ని సంపూర్ణంగా నివారించారు. ఎక్కడా, ఏ గ్రామంలోనూ, ఏ టౌన్‌లోనూ ఏ పోలింగ్ బూత్ దగ్గర కూడా త్రాగి తూలుతుండిన ఓటరంటూ కన్పడలేదు. కలెక్టర్ గారు ఈ విషయంలో విజయం సాధించినట్లే లెక్క.

సారాయి విషయంలో కలెక్టర్ శ్రీ ఎం. సాంబశివ రావు ఎక్సైజ్ అధికార్లను తరిమి తరిమి పని చేయించారు. ఎక్కడా రాజీ పడలేదు. మంత్రి శ్రీ పసల పెంచలయ్య ఎన్నికల కార్యాలయంలోకి ఒక సాధారణ ఎక్సైజ్ అధికారి వెళ్లి, సారాయి పొట్లాలు వున్నాయేమోనని సోదా చేశారంటేనే కలెక్టర్ పట్టుదల ఎంత తీవ్రంగా వుండిందో అర్థం చేసుకోవచ్చు; అభ్యర్థులు కూడా సారాయి పంచడానికి భయపడ్డారు. గ్రామాలలో సారాయి పంచారన్న వార్త బయటకు వస్తే మహిళల ఓట్లు ఎదురు తిరుగుతాయన్న భయం వారిని ఆ జోలికి పోకుండా నిలువ రించింది.

### లయన్స్ క్లబ్ చర్మ వ్యాధి శిబిరం

నెలూరు లయన్స్ క్లబ్ నవంబర్ 27 తేది డాక్టర్ రామచంద్రా రెడ్డి ఆస్పత్రి - పీపుల్స్ పోలి క్లినిక్‌లో - ఉచిత చర్మ వ్యాధి చికిత్సా శిబిరం నిర్వహించింది. మద్రాసు అపోలో ఆస్పత్రికి చెందిన డెర్మటాలజిస్ట్ డాక్టర్ మురళీధర రాజగోపాల్ 300 మంది రోగులను పరీక్షించారు. వీరిలో 40 మందికి కుష్టు వ్యాధి వున్నట్లు నిర్ధారించా రాయన. వారందరినీ నెల్లూరు కుష్టు చికిత్సాలయంలో చేర్చుకుని, చికిత్స ప్రారంభించ వలసిందిగా సిఫార్సు చేశారాయన.

పరీక్షించిన రోగులందరికీ, రేమాండ్స్ షో రూం అధినేత శ్రీ

కొరవ 7 పేజీలో

27 తేది ఉదయం పెళ్లకూరు రామచంద్రారెడ్డి గారి ఇంట్లో ప్రధానితో - జమీన్‌రైతు వనమాలి, పెళ్లకూరు వసంత కుమారరెడ్డి, తూపిలి విజయసారథి, పెళ్లకూరు శాలిని

## సణుగుడు

4 పేజీ తరువాయి

వారికి రాజకీయ సిద్ధాంతాలు, పథకాలు, వ్యూహాలు బోధిస్తూ, అధికారంలో వుండే వారికి బ్రేక్‌ఫాస్ట్‌లిస్తూ, వారికి అధికారం పోగానే తిట్ల వర్షం కురిపిస్తూ రోజులు వెళ్లబుచ్చుతుంటే వారాయన.

అటువంటి మేగోరెకు ఇప్పుడెందు వల్లనో వున్నట్లుండి తానొక్కడే ఒంటరిగా వైధవ్యం అనుభవించడం అవమానంగా తోచినట్లుంది. తన జాతి మనుషుల జన సంఖ్య పెంచితే బాగుండు నన్పించింది. అంతే, అప్పటి నుంచి - ఆయన ఆశీర్వదించమని వచ్చిన ముత్తయిదువను "నా లాగా పది కాలాల పాటు చల్లగా వుండమని" బోడి గుండు ముదుసలి దీవించినట్లు - తన ఇంటి కొచ్చే, తన మాట వినే కాంగ్రెస్ రాజకీయ వాదులందరినీ తన సంఘంలో చేర్పించడానికి రంగం సిద్ధం చేశారు. దాని ఫలితమే ఈనాటి ఎన్నికల్లో కాంగ్రెస్‌కు పట్టిన ఈ దుర్గతి. ఆయన బుట్టలో చాలా మందే పడ్డారు. సంఘానికి మంచి సంఖ్యలోనే సభ్యత్వం సమకూరింది.

మొదటి బోణి వేమారెడ్డి రామచంద్రా రెడ్డి గారిది! ఆయనది అసలు, సిసలు రాజకీయ వైష్యం. మొన్నటి వరకు జనార్దన రెడ్డి స్నేహితంతో పదవులు, వ్యాపారాలు సమకూర్చుకుని పచ్చగా, పండు ముత్తయిదువ వలె కళ కళ లాడుతుండినారు. ఎవరి దిష్టి కళ్లు తగిలాయో పాపం, మేగోరె హితబోధకు చెవి ఇచ్చి, ఢిల్లీ విమానమెక్కి ఒక్కసారిగా తన రాజకీయ వైభవాన్నంతటినీ కోల్పోయారు. ఎన్నిక రోజు తన వూరికి తాను వెళ్లలేని దయనీయ స్థితికి దిగజారి పోయారు. తాను స్వయంగా ఎన్నికల్లో పోటీ చేస్తే డిపాజిట్ దక్కించు కోలేని ఘోరావమానానికి గురైవారు. ఎన్నికల తర్వాత వేమారెడ్డి రామచంద్రా రెడ్డి గారికి మేగోరె ఒక పడక కుర్చీ బహుమానంగా పంపించవచ్చు.

గోరె రెండవ గురి, పెళ్లకూరు రామచంద్రా రెడ్డి గారి పై ఎక్కుబెట్టబడి వుంది. పివి ప్రధానిత్వంతో- ఎన్టీఆర్‌కు లక్ష్మీపార్వతి చిక్కినట్లు ఆఫీసు ఛైర్మన్‌గిరి సంపాదించుకొని కళకళ లాడుతున్నారు పెళ్లకూరు. ఆయనకూ దిష్టి దోషం తగిలినట్లే వుంది. లేకుంటే ప్రధాని సన్నిహితుడుగా వుండి, ప్రధానిని తన ఇంటికి రప్పించు కోగల్గిన స్థాయి నందిన వాడు ఎన్నికలలో ఉత్సాహంగా జిల్లా అంతా తిరిగి గౌరవంగా బ్రతకాల్సింది కాస్త, పుట్టిన వూరులో సైతం ఓటేయడానికి మనస్కరించని స్థితిలో, ఢిల్లీకి వెళ్లిపోయారు. పెళ్లకూరు కట్టిన పదవి తాళి గట్టిది కాబట్టి, పివి చల్లగా చూసినంత కాలం ఆయన రాజకీయ మాంగల్యం చెక్కు చెదరదు కాబట్టి ఇంకా తట్టుకొని నిలబడి వున్నారు కాని, లేకుంటే మేగోరె కళ్లు పడి ఇంకా పడక కుర్చీ ఎక్కకుండా వుండ గల్గేవారు కాదు. ఆయనకు ఆ బహుమతి నివ్వడానికి మేగోరె మరి కొంత కాలం ఓపిక పట్టాలి.

పెళ్లకూరు ఒక వర్గానికి పరిమితమై, చెప్పుడు మాటలకు లోబడి, అందరికీ దూరం కాకుండా - పెద్ద మనిషి వలె ప్రవర్తించి వుంటే పెళ్లకూరు జిల్లా వ్యాప్తంగా అందరి గౌరవాభిమానాలు అందుకునేవారు. సంకుచిత తత్వంతో వ్యవహరించి, వర్గ దృక్పథంతో తన స్వంత నియోజక వర్గంలో తెలుగు దేశాన్ని సమర్థించి అనవసరంగా పరువు పోగొట్టుకున్నారాయన.

జొన్నవాడ రెడ్డి మరొక సభ్యుడు కాదగిన వారి సంఘంలో వున్న సీటును వదలు కోవడమే కాక, ప్రక్క సీటులో తెలుగు దేశాన్ని బహిరంగంగా సమర్థించి జనం దృష్టిలో చులకనై పోయారాయన. ఆయన చెప్తున్నట్లు - నిజంగా జనార్దన రెడ్డి మీద వ్యతిరేకతతోనే మాగుంట వర్గంతో చేరి వుంటే - ఆ నిర్ణయం జనార్దన రెడ్డి ముఖ్యమంత్రిగా వున్నప్పుడు తీసుకుని వుండాలి. అప్పుడు ప్రతిష్ఠ పెరిగి వుండేది; ప్రజలూ ఆదరించి వుండేవారు. పదవి పోయిన తర్వాత విబేధించడంతో పాటు, తనతో ఐదేళ్ళు స్నేహం చేసిన ఆనం వివేకానంద రెడ్డి పై కారణం లేకుండా నిందలు వేయడంతో ఆయన నిర్ణయం పట్ల జనంలో అనుమానాలు తలెత్తాయి. కొత్త స్నేహం చేసిన మాగుంట వారు ఆయనకు టిక్కెట్ ఇప్పించక పోవడమే కాదు, ఆయన సీటును తాము తన్నుక పోయారు. ఆ పని పూర్తి కాగానే ఆయనకు విరోధి అయిన కెవి సుబ్బారెడ్డిని ఆదరించి మరింత అవమానించారు. ఇప్పుడు ఇటు జనార్దన రెడ్డికి, అటు ఆనంకు కాకుండా, మాగుంట వర్గంలో విలువ లేకుండా, జనంలో ప్రతిష్ఠ కోల్పోయి మేగోరె సంఘంలో సభ్యుడుగా చేరి పోయారాయన. కెవి సుబ్బారెడ్డి పరిస్థితి అదే! అయితే ఆయన కొంచెం సీనియర్ సభ్యుడు.

జనార్దన రెడ్డికి, రామ నారాయణ రెడ్డికి కూడా తమ సంఘంలో సభ్యత్వం ఇవ్వాలని మాగుంట సుబ్బరామ రెడ్డిని ఎగదోలి పెద్ద ప్రయత్నం చేశారాయన. కానీ ఆ కృషి ఎదురు తిరిగి వారిద్దరూ తమ పదవులు, రాజకీయ జీవితపు పునిస్త్రీత్వాలను పదిలంగా కాపాడు కొన్నారు. వారి పైకి వచ్చిన వారికే సభ్యత్వ స్వీకరణ ప్రమాదం ఏర్పడేట్లుంది.

తాము తప్ప మరెవ్వరూ గెలవడానికి లేదన్న పంతం చూపి అందరినీ ఓడిస్తే మిగిలేది స్మశానం; దాన్ని ఏలడానికి సిద్ధపడేట్లున్నారు వారు. అది భస్మాసుర వరమే కదా?

ఈ ఎన్నికల తర్వాత మేగోరె సంఘంలో సభ్యులుగా చేరడానికి చాలా మంది కాంగ్రెస్ అభ్యర్థులే లభించేట్లున్నారు. ఆయన ధ్యేయం నెరవేరు తున్నది; కాంగ్రెస్‌కు చేటు కాలం దాపురిస్తున్నది ప్రారబ్ధం!





### నెల్లూరు ముచ్చట్లు

6 పేజీ తరువాయి

సాయిబాబా మందులు పంచి పెట్టారు. ఛార్టర్డ్ అకౌంటెంట్ శ్రీ డి.వి. రమణయ్య శిబిరం ప్రారంభించారు. డాక్టర్, సాయినాథ్ శిబిరం ఛైర్మన్‌గా వ్యవహరించారు. లయన్స్ క్లబ్ అధ్యక్షుడు శ్రీ పి. సత్యనారాయణ, కార్యదర్శి శ్రీ ఆనందకృష్ణ పాల్గొన్నారు.

లయన్స్ క్లబ్ రీజనల్ కో ఆర్డినేటర్, హోటల్ శివం అధినేత శ్రీ వై. శ్రీనివాస రావు (సురేష్) శిబిరం ఏర్పాట్లు పర్యవేక్షించారు.

300 మంది రోగులలో 40 మందికి కుష్ఠు వ్యాధి అని తేలిందంటే, టౌన్‌లో ఆ వ్యాధి చాలా ప్రమాద కరంగా వ్యాప్తి చెందుతున్నట్లు లెక్క. వైద్యాధికారులు అప్రమత్తంగా మెలగడం అవసరం.

## బొమ్మన బ్రదర్స్- నెల్లూరులో షోరూం

రాష్ట్రంలో వస్త్ర దుకాణాలలో నంబర్ వన్ కంపెనీగా పేరు పొందిన బొమ్మన బ్రదర్స్, తమ షోరూంను 7 తేది నెల్లూరులో ప్రారంభించ బోతున్నారు. రాజమండ్రిలో మొదలైన ఈ షోరూంల పరంపర ఇప్పుడు రాష్ట్రంలోనే పెద్ద చైన్‌గా అభివృద్ధి చెందింది. రాజమండ్రి, శ్రీకాకుళం, కడప, హైదరాబాదు, సికింద్రాబాద్, కొత్తగూడెం, వైజాగ్‌లలో వీరికి 9 షో రూమ్‌లు వున్నాయి. నెల్లూరులో పెట్టబోయేది పదవది. స్త్రీలు, పురుషులకు సంబంధించిన వస్త్రాలు రెండూ ఈ షోరూంలో లభిస్తాయి. ఒక చైన్‌గా నిర్వహించే షోరూంలు కాబట్టి సరసమైన ధరలకే, మంచి వెరైటీ వస్త్రాలు సరఫరా చేయగలమని షోరూం అధినేత శ్రీ బొమ్మన దుర్గా ప్రసాద రావు చెప్తున్నారు. ప్రతిష్ఠాత్మకమైన ఈ షోరూం వల్ల నెల్లూరు టౌన్‌కు మంచి గుర్తింపు కూడా!



### In the Court of the District Munisf, Venkatagiri

S.C.No. 27 of 94.

Syndicate Bank, Jayampu -Plaintiff.

Vs

1. Ontela Subbaiah and another -Defendents

**NOTICE**

To, Ontela Subbaiah, S/o. Bodeiah, Pallipadu Village, Balaya palli Mandal, Nellore Dt.

The above suit is stands posted for your notice and appearance before this Hon'ble Court at 10-30 A.M. on 6-12-94. If you fails to appear exparte order follows.

-A. Subramanyam,
Advocate, Gudur-2.

జమీన్‌రైతు
సంవత్సర చందా రూ. 100/-
అర్ధసంవత్సర చందా రూ.50/-
విడిప్రతి రూ. 2/-

## In the Court of the Subordinate Judge, Gudur.

I.A.No. 106/94.

O.S.No.19/92.

Indian Overseas Bank, Chennur -Petitioner
Represented by its Branch Manager -Plaintiff.
Vs . 1. Metta China Sidda Reddy and another Respondents /Defendants.

### NOTICE

To, Metta china Sidda Reddy, S/o. Krishna Reddy, Thippavarappadu Village, Gudur Mandanl, Nellore Dt.

The above case is stands posted for your notice and appearance before this Hon'ble Court at 10-30 A.M. on 7-12-94. If you fails to appear exparte order follows.

-A.Subramanyam,
Advocate, Gudur.

## నెల్లూరు సబ్ జడ్జి కోర్టులో

E.P.No.120/93 in
O.S.No.27/90

శ్రీరామ్ చిట్స్ & ఇన్వెస్ట్‌మెంట్స్ ప్రై లిమిటెడ్, రిప్రజెంటెడ్ బై యిట్స్
బ్రాంచ్ మేనేజరు -వాది/ Dhr
ఒ.హరినారాయణరెడ్డి -ప్రతివాది/JDr

ఈ క్రింద కనుపరచిన ప్రతివాది తాలూకు స్థిరాస్తిని పై కోర్టు యెదుట 12.12.94 తేదిన ఉదయం 10.30 నుండి 5.00 గంటల లోపల బహిరంగంగా వేలం వేయబడును. పాటలో పాల్గొన దలచిన వారు ఆ దినం పాడుకొనవచ్చును.

### షెడ్యూలు

నెల్లూరు రిజిస్ట్రేషన్ డిస్ట్రిక్టు యిలాకా నెల్లూరు సబ్ రిజిస్ట్రేషన్‌లో చేరిన నెల్లూరు మునిసిపాలిటీలో చేరిన నెల్లూరు బిట్ - 1 పోస్టల్ కాలనీలోని ఆంధ్రకేసరి నగరు, సర్వే నెం.2022 A/2 రు భూమి లే అవుటు వేయబడిన ప్లాను దాఖలా ప్లాట్లలో ప్లాటు నెం. 64 రు.

యు 0.5 1/2 సమానము 33 1/3 అంకణములు స్థలమునకు హద్దులు.

తూర్పు: లే అవుటు రోడ్డు; దక్షిణం : ప్లాటు నెం. 65; పడమర :శంకరయ్య గారి ప్లాటు నెం.47; ఉత్తరం : రత్నం గారి ప్లాటు నెం. 63.

ఈ హద్దులలోని 33 1/3 అంకణములు స్థలమున్నూ, యీ స్థలమునకు గల యావత్తు యీజిమెంట్ హక్కులున్నూ. వాటి విలువ : రూ.1,20,000/- అమీనా విలువ : రూ.2,80,000/-

పి. సురేంద్ర. పి. వేణుగోపాల్
Advocates for DHr

## జనవాణి

రచయిత ఆలోచనా సరళికి, పరిజ్ఞానానికి ఈ అనువాదం చక్కగా అద్దం పట్టింది. రేడియో నాటక విభాగంలో ఈ నాటకం ఒక ప్రత్యేక అలంకారంగా ప్రవేశించింది. నాటకంలో పాత్రధారు లందరూ వారి పాత్రలను గొప్పగా పోషించారు. శ్రీమతి దుర్గా భాస్కర్ స్టేషన్ డైరెక్టరుగా వివిధ పనులతో తల మునకలవుతూ, నాటక రచన కొనసాగించడం అభినందనీయం.

- గ్రిద్దలూరు గోపాలరావు

నెల్లూరు.

### బ్రాహ్మణ సంఘాల తీరు!

క్షణానికో చిత్రం వలె నెల్లూరులోని బ్రాహ్మణ సంఘాలవారు ప్రకటనలు ఇస్తున్నారు. కాస్తోరాం చరకతో నెల్లూరులో పెద్ద ర్యాలీ నిర్వహించి, ద్రోణం రాజా సత్యనారాయణను తీసుకొచ్చి 20 అసెంబ్లీ సీట్లు కావాలన్నారు. తరువాత తమ సంఘానికి రాజకీయాలతో సంబంధం లేదన్నారు. ఆ తరువాత కాంగ్రెస్ పార్టీకి మద్దతన్నారు. రెండు, మూడు రోజుల క్రితం బి.జె.పి.కి మద్దతు ఇస్తున్నట్లు చెప్పారు. చివరగా ఎవరికి ఇష్టం వచ్చినట్లు వారు ఓటు వేసుకో వచ్చని ప్రకటించారు. అసలు ఈ మాట మొదట్లోనే అని వుంటే ఎంతో గౌరవంగా, హుందాగా వుండేది సంఘం వారికి. ఈ నాయకులకు సంఘం అభివృద్ధిగాను చేయ వలసిన కార్యక్రమాలుగా ఉచిత ఉప నయనాలు, పేద విద్యార్థులకు చదువులు, వివాహ వ్యవస్థను చక్క దిద్దడం వంటివి ఎన్నో ముందు వున్నాయి. వాటిని వదిలి రాజకీయాల వైపు దృష్టి కేంద్రీకరించి సంస్థ గబ్బు పట్టడం బాధగా వుంది.

-ఎస్.వి.ఎస్. సత్యస్వరూప్

నెల్లూరు.

### నాయకులకు నైతిక సూత్రాలు రూపొందించాలి

ప్రభుత్వ ఉద్యోగుల తోపాటు రాజకీయ నాయకులకు కొన్ని నైతిక సూత్రాలు రూపొందించి వాటిని రాజ్యాంగంలో పొందు పరచాలి. ఇన్నాళ్లు ప్రజలకు తెలియని చట్టాలలోని చిర్రు వల్లే ప్రజాస్వామ్య వ్యవస్థను శేషన్ వంటి అధికారులు చక్కదిద్ద గల్గుతున్నారు. మరి కొంతమంది వుద్యోగులు శేషన్‌ను ఆదర్శంగా తీసుకొని వ్యవస్థ అభివృద్ధికి పాటుపడాలి. ఉద్యోగులు, నాయకులు సకల వ్యసనాలకు దూరంగా వుండేట్లు చట్టాలు రూపొందించాలి. ప్రజల అభివృద్ధిని పట్టించుకోని నాయకులను బహిరంగంగా శిక్షించే విధంగా రాజ్యాంగంలో చట్టాలను సవరిస్తూ సూత్రాలను పొందు పరిస్తే బాగుంటుంది.

నెల్లూరు - వి.రమణయ్య

### కొత్త రేషన్ కార్డులివ్వండి

ప్రజలు రేషన్ కార్డుల కోసం మండల రెవిన్యూ కార్యాలయాల చుట్టూ తిరిగి తిరిగి వేసారి

3 పేజీ కొరవ

పోతున్నారు. అధికారులు కొత్త కార్డుల జారీకి ఎటువంటి చర్యలు తీసుకోవడం లేదు. దీనివల్ల బదిలీలపై వచ్చిన వాళ్లు, కొత్త కాపురాలు పెట్టినవారు, ఇతర ప్రాంతాల నుండి వచ్చి స్థిరపడిన వాళ్లు రేషన్‌పై పడరాని పాట్లు పడుతున్నారు. బహిరంగ మార్కెట్‌లో బియ్యం ధర ఆకాశాన్ని అంటివుంది. పేద, మధ్య తరగతియుల ఇబ్బందిని గమనించి కొత్త కార్డులు మంజూరు చేయకూడదనే నిర్ణయం ఏదైనా ప్రభుత్వం తీసుకొని వుంటే దాన్ని సడలించాలని మనవి.

సంగం - పోట్ల శ్రీహరి

### దేవుడ్ని దర్శించడానికి అనర్హతలున్నాయా?

గతవారం జమీన్‌రైతులో తనని వెంకటేశ్వర స్వామి దర్శనానికి కొందరు అడ్డుకొన్నట్లు, దానికి దేవస్థాన సిబ్బంది సహకరించినట్లు నటి ఆమని చెప్పింది. కలియుగ వైకుంఠ మనబడే తిరుపతి కొండమీద వెంకటేశ్వర స్వామి సన్నిధిలో ఆమెపట్ల ప్రవర్తించిన తీరు నిజమైతే సభ్య సమాజమే కాదు, హైందవ సంస్థలు సిగ్గుతో తల వంచుకోవాలి. దేవుడి ముందు అందరూ సమానులనేది విశ్వవ్యాపిత సత్యం. కోటీశ్వరుల నుండి కూటికి లేనివారి వరకు, పారిశ్రామికవేత్తల నుండి పడుపు వృత్తిలో బ్రతికేవాళ్లు కూడ దేవుడి ముంగిట సమానులే. అలాంటిది నటి ఆమని వృత్తిరీత్యా సినిమాలలో అర్ధనగ్నంగా నటించి వుండవచ్చు. దానికి దేవుడి దర్శనానికి సంబంధమేమిటి? దగాకోర్లు, దోపిడీగాళ్లు, స్మగ్లర్లు, చీకటి వ్యాపారులు, మోసగాళ్లు, దేశాన్ని తాకట్టు పెట్టడానికి వెరవని వాళ్లు తిరుపతిలో దేవుని ముంగిట అత్యంత గౌరవాలతో ఆదరింప బడుతున్నారు. అటువంటిది ఒక నటి మానసిక విశ్వాస దృక్పథంతో కుటుంబ సమేతంగా వస్తే దాన్ని నిరోధించడం ఎంతమాత్రం ధర్మమో చెప్పండి.

మానవతా విలువలు కలిగినవారు, ఆధ్యాత్మిక దృక్పథం కలిగినవారు ఈ విషయంలో ఆలోచించమని మనవి.

-డాక్టర్ పెళ్లకూరు రవీంద్రారెడ్డి

నెల్లూరు

### గ్రంథసమీక్ష

4 పేజీ కొరవ

ప్రవహింప చేయడానికి 8 సంవత్సరాలు పట్టింది వారికి. కాబట్టే అనువాదంలో అనుభవం కవితలో కట్టుదిట్టమయిన ప్రతిభ చూపకల్గారు.

అనువాదం మూలవిధేయమై గీతా మకరందంలోని మాధుర్యానికి లోటు రాకుండా చేయడం అనువక్త నైపుణ్యానికి ప్రతీగా నిల్చియున్నవి.

"చతుర్వర్ణ్యంమయాసృష్టం" అనే శ్లోకం అనువాదం చేస్తూ

తె.గీ. అమల గుణకర్మముల విభాజన మొనర్చి
పార్థ!సృష్టించితివి నాల్గు వర్ణములను
అమ్మెయువికర్తనయితి నే నట్టులయ్యు
అవ్యయునినన్ను కర్తృత్వ మంటకుండు

మూలంలోని చాతుర్వర్ణ్యం, విభాగశః అనే పదాలు అనువాదంలో మూల విధేయతను విశదం చేస్తూ పార్థ! అనే సంబోధన విషయ వివరణ కతృత్వంను వ్యక్తం చేయుచున్నది. గ్రంథమంతా రచయిత అనువాదం పాఠకునకు ప్రత్యేకం. శ్లోకార్థాపేక్ష లేకుండా లలిత భావస్ఫూర్తి కల్గించడం వారి అనువాదంలో నైపుణ్యాన్ని సూచిస్తున్నది.

8వ అధ్యాయంలో "అవ్యక్తోపవ్యక్తయస్సర్వాః" అనే శ్లోకాను వాదంలో అహరాగమే, రాత్ర్యాగమే అనే పదాలను బ్రహ్మపగట బ్రహ్మరాత్రము అని అనువక్త చేసిన అనువాదము ఉచితమై అవ్యక్త ప్రకృతిని వ్యాపించుచున్నది.

వేదాంత దృష్టి సాంఖ్యదృష్టి కల్గిన క్షేత్రక్షేత్రజ్ఞ విచార విభాగములోని శ్లోకానువాదములు అనువక్త అనువాద లాలిత్యానికి నిదర్శనం. గీతావాదం లలితపద్య సామాన్యునికి సైతం విధంగా అనువాదంచేసి కృష్ణయ్య ప్రశంసనీయులు.

## శివారెడ్డి పద్యాలు

### బెజవాడ రామచంద్రారెడ్డి

పదులునూర్లువేలుపద్యాలువ్రాయొచ్చు
రాశిపోయ్యవచ్చురామచంద్ర
రెడ్డి పద్యానుపారబాటు
విజిబాలైకవిని ఎత్తుబడ్డ!
కాడిమేడిలేనికాపోళ్ళచిన్నోణ్ణి
అక్షరాలురానిఅర్భకుణ్ణి
నన్నుసత్కరిస్తన్నుసన్మానిస్తె
నాగరికులుసభలోనవ్వుతారు.

## పంచాంగం

### జ్యేష్టకార్తె

3తేది శనివారం జ్యేష్టకార్తె ప్రారంభం

### ముహూర్తములు

4తేది ఆదివారం రా.గం. 7.50 మిధున లగ్నమున వివాహములకు,

8తేది గురువారం రా.గం.7.52 లకు మిధున లగ్నమున వివాహ గృహప్రవేశములకు సుముహూర్తములు వున్నవి.

### డిసెంబరు తిథులు

మార్గశిరశుద్ధ

తే 3 శని ప్రతిపత్ రా.గం. 3.27వ
తే 4 ఆది విదియ రా.గం. 1.16వ
తే 5 సోమ తదియ రా.గం. 11.18వ
తే 6 మంగళ చతుర్థిరా.గం. 9.40వ
తే 7 బుధ పంచమిరా.గం. 8.28వ
తే 8గురు షష్ఠి రా.గం. 7.28వ
తే 9 శుక్ర సప్తమి రా.గం.7.04వ

స్వయంపాకుల శ్రీనివాసులు, యం.ఎ.

### పోయినవి

ఈ సంవత్సరము మే నెలలో నా గ్యాస్ బెస్టింగ్ సర్టిఫికెట్ గూడూరులో పోయినది. ఎవరికైనా అది దొరికిన యెడల నాకు చేర్చ గోరుతాను. దానిని ఇచ్చిన వారికి తగిన పారితోషికం ఇవ్వబడును.

ఇట్లు
G.శ్రీధర్, H.No.11-366,
అశోక్ నగర్, గూడూరు.

# అన్ని శక్తులు ఏకమైనా జనార్ధన రెడ్డి విజయుడే!

ప్రమాదం లోకి నెట్టాయి. దురదృష్ట దేవత తరుముకొంటూ వచ్చి, ప్రక్కనే తిష్ట వేసింది. ఫలితం సందేహంలో పడింది.

2 పేజీ కొరవ

### యానాదిరెడ్డి గారి పాచికలు పారలేదు

కావలి ఫలితం పూహించడం చాలా కష్టంగా వుంది. కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ కలికి యానాది రెడ్డిగారి పాచికలు పెద్దగా పారలేదన్నది మాత్రం నిజం. స్వతంత్ర అభ్యర్థి శ్రీ గొట్టిపాటి కొండప నాయుడు రంగంలో వుండటంతో ఎవరిది గెలుపో పూహించడం అసాధ్యంగా పరిణమించింది.

కావలి టౌన్‌లో యానాది రెడ్డి గారిని అందరూ వెన్నుపోటు పొడిచారు. ప్రక్కన తిరిగిన వారూ అధిక సంఖ్యలో ఓట్లను ఆకర్షించడంతో ముగ్గురి మధ్య గెలుపెవరి దన్న సందేహంలో పెరుతున్నది.

మంత్రిగా యానాది రెడ్డి తమకు దూరమైనాడన్న అసంతృప్తి జనంలో కన్పించింది. దానికి తగినట్లే అనారోగ్యం వల్ల ఆయన పెద్దగా ప్రచారం చేయలేక పోయారు. కెకె రెడ్డి, కలిగిరి రామిరెడ్డిల విద్రోహం బాగా దెబ్బ పెట్టింది. తెలుగు దేశం అభ్యర్థి శ్రీ ఒంటేరు వేణుగోపాల రెడ్డి బంధుత్వాలను కలకోయడం తోపాటు, డబ్బు విచ్చల విడిగా వెచ్చించారు. ఒక్క టౌన్‌లో 30 తేది రాత్రి 20 లక్షల వరకు పంచారట. ఆయన దగ్గర పనిచేసిన రాజకీయ జీవులన్నీ జేబులు నింపుకొన్నాయి. అసలే తెలుగుదేశం గాలి, ఆపై యానాది రెడ్డిగారి మీద అనుచరుల తిరుగుబాటు, కొండప నాయుడిగారి ఓట్ల చీలిక, ధన ప్రభావం కలగలిసి తెలుగుదేశం అభ్యర్థి శ్రీ వేణుగోపాల రెడ్డినే విజయం అంచున ఆసీనుణ్ని చేశాయి.

చాలా కష్టపడ్డారు. సర్వ శక్తులూ వడ్డి పోరాడారు. జిల్లా అంతటా కాంగ్రెస్‌ను పెది బాకులతో పొడిచిన మాగుంట సుబ్బరామ రెడ్డిగారు ఇక్కడ మాత్రం మనస్ఫూర్తిగా పనిచేశారు. అయినా అదృష్టం అనుకూలించ లేదన్పిస్తూంది.

ఉదయగిరి ఓటర్ల మనోభావం కనిపెట్టడం చాలా కష్టం. అంతటి రాజకీయ చైతన్యం జిల్లాలో మరెక్కడా వుండదు. అందువల్ల బయటకు కన్పించే దొకటి, లోపల వేసిందొకటి అయితే మాత్రం ఫలితంలో మార్పు వుండవచ్చు. కాని, పోలింగ్ సరళిని చూసిన మా విలేఖరికి మాత్రం కాంగ్రెస్ ప్రమాదంలో కూరుకు పోయినట్లే అన్పిస్తూంది! వ్యక్తిగత కక్షలతో, కుల తత్వంతో రాజమోహన రెడ్డి- తనకు ఐశ్వర్యం ప్రసాదించిన, రాజకీయంగా తనకంటూ గుర్తింపును తెచ్చిన కాంగ్రెస్ పార్టీకి తీరని ద్రోహం చేశారు. ఆత్మ పరిశీలన చేసుకో గల్గితే ఆయనకు తానెంత తప్పు చేసింది అర్థమౌతుంది.

వింజమూరు దగ్గర ఒక పోలింగ్ బూత్‌లోని దృశ్యం

తీసుకు వెళ్లారు.

ఇది సంజీవ రెడ్డికి కోపం తెప్పించింది. తనను తిడుతూ, తనను కొట్టి అవమానించ దానికి కూడా యత్నించిన, తమ కుటుంబీకుడైన ఆనం రామ నారాయణ రెడ్డిని ఓడించడానికి రాపూరులో డబ్బు క్రుమ్మరించిన మాగుంట వర్గంతో చేతులు కల్పడం అన్యాయం కాదా అన్నది ఆయన ప్రశ్న. ఇంతకాలం తన దగ్గర పని చేయించుకొని, తన సహకారంతో మూడు సార్లు గెల్చి, ఇప్పుడు తన శత్రువులతో చేతులు కల్పితే తాను సహించే దెట్లా అన్నది ఆయన ఆవేదన. ఈ కోపంతో సంజీవ రెడ్డి ఆత్మకూరు ఛాయలకు కూడా వెళ్లలేదు. ఆఖరి నిముషం వరకు క్షణంలో ఆయన డబ్బును విచ్చల విడిగా వెద జల్లారు. పూగిస లాటలో వుండిన గ్రామ నాయకులకు భారీగా ముడుపు లందజేశారు.

తెలుగుదేశం అభ్యర్థి శ్రీ కొమ్మి లక్ష్మయ్య నాయుడిది చివరి వరకు ఎదురీతే! ఆయనకు తెలుగుదేశం గాలిలో కొట్టుక వచ్చిన ఓట్లయితే వుండినాయి కాని, వాటిని పోగు చేసి, పెట్టెల్లో వేసే యంత్రాంగం ఏర్పడలేదు. బిజెపి రాధయ్య సందు దొర్కిన దగ్గరల్లా దేశం పెట్టెలకు కన్నాలు వేసి, అందినన్ని ఓట్లు ఎత్తుక వెళ్లారు. ఈ గందరగోళం ఫలితంగా కాంగ్రెస్ గెలుపు సందేహంలో పడింది. అయితే ఓట్ల చీలికను గమనించి చూస్తే, గతంలో వలె డాక్టర్‌గారు

# రాపూరులో రామనారాయణ గెలుపు ధైర్యంగా చెప్పవచ్చు!

రహస్యంగా చేతిని క్రిందకు దించి సైకిల్‌నే, విమానాన్నే పైకెక్కించ దానికి యత్నించారు. 50 వేల ఓట్లున్న టౌన్‌లో సహజంగా యానాది రెడ్డిగారు మెజారిటీ సాధించే వారు. ఈసారి ఆ వాతావరణం కన్పడ లేదు. అక్కడే ఆయనకు లోటు ఏర్పడింది. ఆయన ఓట్లను పెద్ద సంఖ్యలో కొండప నాయుడు చీల్చుక పోయారు. తూర్పు పల్లెలలో మాత్రం కాంగ్రెస్ కన్పించింది. అక్కడ కొండప నాయుడి పూసే లేదు. తెలుగు దేశం, కాంగ్రెస్‌లే వుండినాయి. పడమటి పల్లెలలో ముగ్గురూ ఓట్లు పంచుకొన్నారు. కొంచెం తెలుగు దేశానికే మొగ్గు వుండినా ఆశ్చర్యం లేదు. కలిగిరిలో తెలుగుదేశం, కొండాపురంలో కొండప నాయుడు ఆధిక్యతలో వున్నారా అన్పిస్తుంది.

ఆషామాషీగా మొదలైన నాయుడి గారి అభ్యర్థిత్వం- ఆఖరి ఛాన్సున్న సామభూతిని ప్రేరేపించి, ఏదైనా విచిత్రం జరిగితే తప్ప, ఫలితం ఆ తీరులోనే వుండవచ్చు.

### విజయ రామిరెడ్డినే విజయలక్ష్మి వరిస్తుందా?

భయపడ్డ బాంబుల ప్రేలుళ్లు లేకుండా ఉదయగిరిలో పోలింగ్ ప్రశాంతంగా జరగడం అందరికీ పెద్ద రిలీఫ్. ఒక్క రెడ్డిపాళెంలో మినహా మరెక్కడా ఉద్రిక్తతలు చెలరేగ లేదు.

పోలింగ్ తీరుచూస్తే, తెలుగుదేశం గాలిని గమనిస్తే, మేకపాటి రాజమోహన రెడ్డి వెన్నుపోటును పరిగణిస్తే, రెడ్డి, కమ్మ కుల పోరాటాన్ని పరిశీలనకు తీసుకొంటే - విజయలక్ష్మి, సైకిల్ గుర్తు లేని తెలుగుదేశం అభ్యర్థి విజయ రామిరెడ్డినే వరించనున్నదా అన్పిస్తుంది. ఈ మాట గట్టిగా చెప్తే, మాదాల జానకిరాం గారి మనసు నొచ్చుకోవచ్చు గాని, అవకాశాలు అట్టే కన్పి స్తున్నాయి. ఆయన ఈసారి

### ఆత్మకూరులో గత చరిత్రే పునరావృతమా?

ఆత్మకూరు నియోజక వర్గంలో పోలింగ్‌కు మూడు రోజుల ముందుకి, పోలింగ్ నాటికి చాలా తేడా వచ్చేసింది. మూడు రోజుల ముందు కాంగ్రెస్‌కు విజయా వకాశాలు మెండుగా వుండినాయి. ప్రతిపక్షం ఓట్లను చెరిసగంగా చీల్చుకున్న తెలుగుదేశం, బిజెపి పార్టీలు డాక్టర్‌ను అందుకో లేనంత తేడాలో వుండినారు. కాని పోలింగ్ రోజుకి ఆ పరిస్థితి లేదు. డిసిసి అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవ రెడ్డి అనుచర వర్గం ఒక్కసారిగా కాంగ్రెస్‌ను వదలి చెల్లా చెదురై పోయింది.

ఆత్మకూరులో ఆనం వర్గానిది బలమైన రాజకీయ కూటమి. గత నాలుగు ఎన్నికలలో వారు డాక్టర్‌నే బల పరిచారు. వారి మద్దతుతోనే డాక్టర్ గారు చావు దప్పి, కన్ను లొట్ట పోయినట్లు వందల తేడాతో గెలుస్తూ వచ్చారు. ఆయనా వారిపట్ల కృతజ్ఞత తోనే వుండేవారు. కాని ఈసారి ఎందువల్లనో ఆయన మొగ్గు మాగుంట వైపుకు మల్లింది. టిక్కెట్ ప్రయత్నంలో వారి సహకారం అర్థించడం తోపాటు, ప్రచారంలోనూ వారి తోడ్పాటును స్వీకరించారు. ఆయన ఆదుర్దా అయనది. చేజర్లలో ఇంతకాలం అండగా వుండిన కొమ్మి లక్ష్మయ్య నాయుడు గురువుకు పంగ నామాలు పెట్టి, తానే దేశం అభ్యర్థిగా ఎదురు నిలవడంతో డాక్టర్‌గారు అక్కడ మాదాసు గంగాధరంను ఆసరా చేసుకోవ డానికి పూనుకొన్నారు. కెకె రెడ్డిని కూడా ఒకే రోజు ప్రచారానికి

ఆయన నిర్ణయం కోసం ఎదురు చూసిన ఆయన అనుచరులు తమ ఇష్టానుసారం తలా ఒక ప్రక్కకు జారుకొన్నారు.

దీని ఫలితంగా డాక్టర్ గారు కష్టాలలో పడిపోయారు. చివరి వందల తేడాతో గట్టెక్కినా ఆశ్చర్యం లేదన్పిస్తూంది. స్పష్టంగా తెల్పి చెప్పడం కష్టం.

కొరవ 10 పేజీలో



## శ్రద్ధాంజలి

మాన్యులు

**శ్రీ కోడూరు కోటారెడ్డిగారు**

అడ్వకేట్, రాయాజీవీధి, నెల్లూరు.

ప్రశాంతంగా ప్రకృతి ఒడిలోకి 24-11-1994తేది ఒదిగి పోయారు. మాన్యులైన వారి మమతలకు జ్ఞాపక చిహ్నాలైన మేము అనునిత్యం వారిని స్మరించుకుంటూ శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

కోడూరు ఇందిర - భార్య

కుమార్తెలు - అల్లుళ్ళు

దేశిరెడ్డి అపర్ణ - ప్రసాద్‌రెడ్డి

వారణాశి అనిత - శ్రీకాంత్

టంగుటూరు అనుజ - నరసింహారెడ్డి

మరియు మనుమరాండ్రు

## జనార్దన రెడ్డి

9వ పేజీ తరువాయి

### రాపూరులో రామనారాయణ - ధైర్యంగా చెప్పవచ్చు

కాంగ్రెస్ గెల్పు తీరుతుందని ధైర్యంగా చెప్ప దగిన నియోజక వర్గం రాపూరు. అంత తెలుగుదేశం గాలిలోనూ, పటిష్టమైన వర్గ పునాదుల పైన నిర్మితమైన ఆనం కుటుంబపు రాజకీయ భవంతి చెక్కు చెదరలేదు. స్వర్గీయ ఏసి సుబ్బారెడ్డి కృషి పుణ్యం. వారికి అంతా వాయిదాల పద్ధతిలో, బావిలో పూట మాదిరి అందుతూనే వుంది.

9 పేజీ తరువాయి

రాపూరులో తెలుగుదేశం ప్రభంజనం వీచకుండా పోలేదు. బలంగానే తోలింది. నెల్లూరు రూరల్, మనుబోలు మండలాలలో దాని ప్రభావం ప్రస్ఫుటంగా కన్పడింది. అయితే అక్కడ అభ్యర్థి ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి బలహీనుడై పోయారు. ప్రచారం నిర్వహించడమే ఆయన తరం కాలేదు. చాలినంత మంది కార్యకర్తలు లభించలేదు. నెల్లూరు టౌన్‌లో 10 వేలకు పైగా ఓట్లున్నా, ఒక్కసారి సైతం ప్రచారానికి రాలేక పోయారంటే అర్థం చేసుకోవచ్చు. రాపూరు, పొదలకూరు మండలాలలోని చాలా పల్లెల్లో ఆయనకు ప్రవేశం లభించ లేదు. సగం సమయం అంకయ్య గౌడ్ చేత విరమింప జేయమని మాగుంట సుబ్బరామ రెడ్డిగారిని ప్రాధేయ పడడానికే సరిపోయింది. మాగుంట గారు డబ్బయితే కోరినంత ఇచ్చారు కాని, జన సమీకరణ వారి తరమూ కాలేదు. తెలుగుదేశం ఓట్లలో అంకయ్య గౌడ్ ఐదారువేలు చీల్చుక పోయారు. ఉన్న్యాల కుటుంబీకులు పోరాటానికి తగినట్లు రాజకీయంగా ఎదగలేదు.

ఈ బలహీనతలన్నీ రామ నారాయణ రెడ్డికి బలం చేకూర్చాయి. అసలే వారిది బలమైన వర్గం; ఆపకమ్న పోదరులు వారితో చెయ్యి కలపడమే కాదు, తమ ఎన్నికే అన్నంత పట్టుదలగా చిత్తశుద్ధితో పని చేయడంతో చాలా గ్రామాలలో ఎదురన్నది లేకుండా పోయింది. 1989లో ఓటమి దెబ్బతో ప్రతి జనం వర్గ గ్రామ నాయకులూ వళ్లు దగ్గర పెట్టుకొని, ఓటు ఓటు గోదారి చేశారు. ఐదారు బూత్‌లలో విజమైన రిగ్గింగ్ చేశారు. రామ నారాయణ రెడ్డిపైన కూడా ఓటర్లలో ఆకర్షణ, సానుభూతి కన్పించాయి.

అన్ని అనుకూలతలు కలిసినా రాపూరులోనూ కాంగ్రెస్‌కు పెద్ద మెజారిటీ వచ్చే సూచనలు లేవు. తెలుగుదేశం గాలి ప్రభావం అది. ప్రత్యర్థి ఎల్లసిరి కాబట్టి ఆ జాకిడిని తప్పించుకొని బయట పడ్డారు కాని, మొదట అనుకొన్నట్లు పాపకన్ను జయచంద్ర శేఖర రెడ్డికి టిక్కెట్ వచ్చివుంటే రామ నారాయణ రెడ్డి రిస్కులో పడిపోయి వుండేవారు.

అంకయ్య గౌడ్ పేపరు ప్రకటనలకే పరిమితం. కనీసం పొదలకూరు టౌన్‌లో కూడా ఆయనకు ఓట్లు పడలేదు. ఐదారు వేలతో పరిమితమై పోతాడని భావించాలి.

ఎట్లయితేనేమి, ఎందరెన్ని రకాలుగా ప్రయత్నించినా రామ నారాయణ రెడ్డి నికరంగా గెల్చే కాంగ్రెస్ అభ్యర్థిగా తమ వర్గం పరువు నిల్పారు.

### జనార్ధన రెడ్డి అభివృద్ధే ఓటర్లను ఆకర్షించింది!

కాంగ్రెస్ గెలుపును నమ్మకంగా వూహించ దగిన మరొక స్థానం - వెంకటగిరి! అన్ని చోట్లవలె అక్కడా తుఫాను వలె వీచిన తెలుగుదేశం ప్రభంజనానికి ఎదురీది, పటిష్టమైన వ్యూహంతో పోరాడి, ప్రతిష్ట పెంచుకున్నారు జనార్ధన రెడ్డిగారు.

ఎన్ని శక్తులు పనిచేశాయి వెంకటగిరిలో - జనార్ధన రెడ్డి ఓటమి చూడాలని! సాక్షాత్తు ముఖ్యమంత్రి కోట్ల విజయ భాస్కర రెడ్డి పరోక్షంగా జనార్ధన రెడ్డిని ఓడించ డానికి కృషి చేశారు. పెద్ద సూట్ కేస్ నిండా డబ్బు పంపాడని చెప్తారు. వైఎస్ రాజశేఖర రెడ్డి తన పేరుతో వుండే యువసేనను రంగం లోకి దించడం తోపాటు తన తండ్రి రాజారెడ్డిని వెంకటగిరికి పంపి, మూడు రోజుల పాటు తెలుగుదేశానికి ప్రచారం చేయించాడు. తుపాకులు, బాంబులు ప్రదర్శించి భయ పెట్టారు. వేమారెడ్డి రామచంద్రా రెడ్డిగారి మిత్ర ద్రోహం తెలిసిందే. ఆయన చివరికి ఏ స్థితికి దిగ జారారంటే, వాకు వేయకున్నా ఫర్వాలేదు, తెలుగు దేశానికి ఓటేసి జనార్ధన రెడ్డిని ఓడించండి అనే నినాదంతో ప్రచారం చేశారు. మాగుంట సుబ్బరామ రెడ్డిగారి తరపున మేగోరె సకల యత్నాలూ చేశారు. ఆదిమూర్తి, బి.రాధయ్య వంటి వారికి కార్లు, డబ్బు ఇచ్చి హరిజనులలో, చేనేత కారులలో విషం చిలకరింప జేశారు. మాజీ కేంద్ర మంత్రి డాక్టర్ చింతా మోహన్ రాత్రి పూట హరిజన వాడలలో రహస్యంగా తిరిగి, రెచ్చగొట్టారు. ఇటు వేమారెడ్డి రామచంద్రా రెడ్డి గారికి, అటు రాజాకు హైదరాబాదు నుంచి, నెల్లూరు నుంచి పలువురు నాయకులు ధనపు సంచులు పంపారు.

అసలే తెలుగుదేశం గాలి ప్రచండంగా వీస్తున్నప్పుడు, అన్ని శక్తులు ఏకమై వెనుక, ముందు పొడుస్తూ వుంటే ఎంత శక్తి కల్గిన యోధుడైనా పోరాడేదెట్లా? అయినా జనార్ధన రెడ్డి అలుపు, ఆయాసం భావించ కుండా పటిష్టమైన వ్యూహంతో ఎన్నికల యుద్ధాన్ని ఎదుర్కొన్నారు. ఆయన చేసిన అభివృద్ధి పనులే ఆయన్ను కాపాడాయి.

వెంకటగిరి టౌన్, బాలాయపల్లి మండలాలలో కాంగ్రెస్ మొగ్గుకన్పించింది. డక్కిలి గ్రామం కాంగ్రెసు వైపు వుంటే, ఆ మండల గ్రామాలు తెలుగుదేశం పక్షంలో ఆధిక్యత చూపాయి. ఓజిలి మొత్తం సైకిలే! కాని అరిమేనిపాడు, చిలమానిచేను వంటి గ్రామాల్లో జనార్ధన రెడ్డి పట్ల ఆదరణ చూపారు. ఈ నియోజక వర్గంలో హరిజనులలో కాంగ్రెస్ మీద అభిమానం ఏ మాత్రం తరగ లేదు.

తెలుగుదేశం అభ్యర్థి వెంకటగిరి రాజా కావడం ఆ పార్టీకి బాగా వుపకరించింది. ఎప్పుడూ ఇల్లు దాటని అంత పెద్దాయన తమను వచ్చి ఓటడిగాడన్న తన్మయత్వంలో పడి పోయారు కొందరు ఓటర్లు. కానీ ఆయన గెలిస్తే, మళ్లీ నియోజక వర్గం ముఖం చూడడని; జనార్ధన రెడ్డిని పోగొట్టు కుంటే అభివృద్ధి ఆగిపోతుందని ఓటర్లు భావించడంతో కాంగ్రెస్ గెలుపుకు ఢోకా లేకుండా పోయింది. గత ఎన్నికల్లో జిల్లాలో కంతా పెద్ద మెజారిటీతో గెల్చిన జనార్ధన రెడ్డి, ఈసారి దాన్ని కోల్పోయి ఐదు వేలతో విజయం సాధిస్తాడన్పిస్తుంది. పోలింగ్ సరళి చూస్తే!

### గూడూరు, సూళ్లూరుపేట దేశం పరమే!

గూడూరు, సూళ్లూరు పేటల గురించి పెద్ద చర్చ అనవసరం. వాటి రెండింటిలో తెలుగుదేశం ఆధిక్యత స్పష్టంగా కన్పించింది. గూడూరులో కాంగ్రెస్ అభ్యర్థి పత్రా ప్రకాశ రావు ఓటర్లను ఆకట్టు కోలేకపోయారు. ఒకటికి రెండు సార్లు గెల్చి ఎందుకూ పనికి రాలేదన్న అసంతృప్తి అతడ్ని ఆణచి వేసింది. అప్పటికి ఒక ప్రక్క వేమారెడ్డి వెంకట కృష్ణారెడ్డి, వై. జానకి రామరెడ్డిలు; రెండవ ప్రక్క నల్లపరెడ్డి జగన్మోహన రెడ్డి తమ భుజాల మీద కెత్తుకొని మోయాలని చూశారు. కాని గుర్రం కొయ్యది - ఎంత తోలినా అక్కడనే వుంటుంది తప్ప పరుగెత్తలేదు కదా? తెలుగుదేశం అభ్యర్థి శ్రీ బల్లి దుర్గా ప్రసాద రావు అదృష్ట జాతకుడు.

సూళ్లూరుపేటలో కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ పసల పెంచలయ్య ఓటమి పరిహార్థులో నిలబడి పలని రావడం దురదృష్ట కరం. ఐదేళ్లు ఆయన పడిన శ్రమ బూడిదలో పోసిన పన్నీరైంది. అప్పటికీ పెంచలయ్య గారు శక్తి వంచన లేకుండా తుది వరకు ... ఫలితం ... సూచనలు లేవు.

తెలుగుదేశం గాలి ఉధృతిలో పెంచలయ్య కృషి, ప్రయత్నం చాలలేదు. తెలుగుదేశం అభ్యర్థి డాక్టర్ పి. రత్నం గెల్చినట్లే భావించాలి.

### సర్వేపల్లిలో సివికి ఇంకా ఆశ?

సర్వేపల్లిలో తనకు 25 వేల మెజారిటీ తగ్గదని ధీమాగా చెప్తున్నారు తెలుగుదేశం అభ్యర్థి శ్రీ సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి. అసత్యాన్నయినా, అతిశయోక్తినైనా అందమైన నిజంగా మలచి చిత్రీకరించడంలో మేనమామ స్వర్గీయ నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి మాటల చాతుర్యం కొంచెం కొంచెంగానైనా అబ్బించుకున్న వాడు కదా?

చంద్రమోహన రెడ్డి మెజారిటీ వూహ నూటికి నూరుపాళ్లు అతిశయోక్తి కాని, నియోజక వర్గంలో పోలింగ్ రోజు వాతావరణం మాత్రం కొంత తెలుగు దేశానికి అనుకూలంగా కన్పించిందనే చెప్పాలి. జె.కె. రెడ్డి, మాగుంట సుబ్బరామ రెడ్డి కలిసి సంయుక్తంగా నిర్వహించిన కాంగ్రెస్ విద్రోహ కాండే అందుకు కారణం. సి.వి. శేషారెడ్డిని ఓడించడానికి లక్షలకు లక్షలు క్రుమ్మరించారీ నియోజక వర్గంలో! దీని ప్రభావం ఇందుకూరు పేట మండలంలో స్పష్టంగా కన్పించింది. జగదేవిపేట, పల్లిపాడు, కొరుటూరు, నరసాపురం వంటి గ్రామాలు పూర్తిగా పసుపు రంగు పులుము కున్నాయి. తోటపల్లి గూడూరు మండలంలోనూ అదే పరిస్థితి.

కానీ, సి.వి. శేషారెడ్డి గత ఐదేళ్లలో ఎమ్మెల్యేగా చేసిన సేవ, ధనికులందరూ ఏకమై ఓడించ జూస్తున్నారన్న ప్రచారం పేద, బలహీన వర్గాలలో ఆయన పట్ల సానుభూతి కల్గించాయి. తెలుగుదేశం మోజు వున్నా కొందరు కాంగ్రెస్‌ను వరించారు. ముత్తుకూరు మండలంలో ఇది బాగా స్పష్టమైంది. అక్కడ చాలా గ్రామాలలో కాంగ్రెస్ మెజారిటీ సాధించింది. వెంకటాచలం నెల్లూరు రూరల్ మండలాలలో ఇద్దరూ సమానమైనారు. ఈ ఓటింగ్ సరళిని బట్టి సివి శేషారెడ్డిలో ఇంకా గెలుపు ఆశ కొట్టుక లాడుతున్నది. ఆయనలో ఓటమి అనుమానం లేదు. ధైర్యంగా వున్నారు.

ఐదేళ్లు జనంతోనే కలిసి వుండి, జనమే జీవితంగా గడిపిన సివి శేషారెడ్డిని ఓటర్లు కొత్త మోజులో నిరాదరిస్తే, ఇక ఆ ఎమ్మెల్యే మాత్రం పదవిలో వుండగా జనానికి సేవ చేయాలని తాపత్రయ పడడం దేనికి?

చంద్రమోహన రెడ్డి మెజారిటీ ప్రకటన పూర్తిగా అతిశయోక్తి; గెలుపు ఎవరిదైనా మెజారిటీ ఐదు వేలలోపే వుంటుంది.

* * *

ఇవీ వివిధ నియోజక వర్గాలలో గెలుపు, ఓటముల అంచనాలు! మొత్తం మీద చూస్తే కాంగ్రెస్ కనుమరుగై తెలుగుదేశం జిల్లా అంతా ఆక్రమించిందని చెప్పాలి. రెండు రూపాయల కిలో బియ్యమే కాంగ్రెస్ కొంప కూల్చింది; ఎన్నుపోట్లు, ... ఆ కొరవా, పరవా నిప్పు పెట్టి బూడిద చేశాయి. పసుపు ముగ్గుల మనక చీకట్లో రానున్న ఐదేళ్లు జిల్లా ఎంతటి అధోగతి పాలౌతుందో వూహించ లేకున్నాము.



## చిత్రసమీక్ష

11 పేజీ తరువాయి

మొందిస్తాడు. శాంతి భద్రతలను నిలబెట్టాడు.

తండ్రి, కొడుకుల పాత్రలను, భిన్న దృక్పథాలు గల ఈ రెండు పాత్రలను హీరో మోహన్‌బాబు తన మంచి నటనతో గొప్పగా మెప్పించాడు. దర్శకుడు రవిరాజా ఈ రెండు పాత్రలను చక్కగా మలిచాడు. ఈ పాత్రలు కనిపించే ప్రతి దృశ్యాన్ని ప్రత్యేక దృష్టితో చిత్రీకరించాడు. ఈ పాత్రలకు సంబంధించి పరుచూరి సోదరుల మాటలు చమత్కారం పులుము కొని బాగున్నాయి. ఈ పాత్రలకే కాదు మిగతా పాత్రలకు కూడా చమత్కరిస్తూ, చెణుకులు విసురుతూ మాటలు చక్కగా వ్రాశారు. దీనివల్ల ఈ సినిమాలో వినోదం పెరిగింది.

ఈనాటి రాజకీయాల మీద, అసభ్య సమాజం మీద, మనుషుల దుష్ట స్వభావాల మీద, దర్శకుడు మంచి చురకలు విసిరాడు. హీరో హీరోయిన్ల కలల లోకాన్ని, ఊహా దృశ్యాలను, నృత్య గానాలను కమనీయంగా సృష్టించాడు దర్శకుడు. కె.ఎస్.ప్రకాష్ కెమెరా ఈ దృశ్యాలను అతి సుందరంగా చూపింది. సిరివెన్నెల కలం నుంచి జాలువారిన "సరసకురా దొరా మనోహరా"- పాట రాజ్-కోటి సంగీతంలో కమ్మదనం కూర్చుకుంది. మిగతా పాటల్లోనూ, నేపథ్యం లోనూ సంగీతం ఉన్నత స్థాయిని పొందింది.

రంభ, సురభి అమాయకపు అమ్మాయిలుగా ప్రేక్షకులను ఆకర్షించారు. సుజాత మంచి నటి కదా. సత్యనారాయణ, సాక్షి రంగారావు, పి.ఎల్. నారాయణ నటనలో వీరెవ్వరూ తక్కువ వారు కారుగా?

హీరో మోహన్ బాబు ద్వి పాత్రాభినయం ఒక ఆకర్షణగా, పరుచూరి మాటల చమత్కారం ఇంకొక ఆకర్షణగా, రాజ్-కోటి సంగీతం మరొక ఆకర్షణగా, రవిరాజా పినిశెట్టి దర్శకత్వం ప్రత్యేక ఆకర్షణగా తొలి నుంచి తుదివరకు ఈ సినిమా ప్రేక్షకులను చుట్టుముట్టి చక్కటి వినోదంతో విందు చేస్తుంది.

## సినిమా

11 పేజీ తరువాయి

పోయేదాన్ని. ఇప్పుడు ఏ ఏ సన్నివేశాలలో ఎలా నటిస్తున్నారో పరిశీలిస్తున్నాను. ఆర్టిస్టుగా నాకిది అవసరం కదా!

### నగ్మా

థియేటర్లో బాగా ఆడని ఆర్ట్ ఫిలిమ్‌లను వీడియోలో చూడడానికి ఇష్టపడతాను. నేనెక్కువగా కాస్ట్యూమ్స్ పరిశీలిస్తుంటాను. "క్లియోపాత్రా" లో ఎలిజబెత్ టేలర్ కాస్ట్యూమ్స్ ఎంత అద్భుతంగా ఉన్నాయి. అలా ధరించి ఏ చిత్రంలోనైనా నటించాలని ఉంది నాకు.

# సినిమా సమ్మెపై హీరోల తిట్లు!

చిత్రసీమలో చాలా కాలంగా జరుగుతున్న సమ్మె పరిస్థితి చక్కదిద్దడానికి, ఐక్యతను కాపాడడానికి కొంతమంది ఈ మధ్య ఫిలిమ్ ఛేంబర్‌లో సమావేశ మయ్యారు. సమ్మె పరిష్కార మార్గం విషయం అటుంచి, ఒకరి నొకరు నిందించు కోవడంతో సభ రసాభాస అయిపోయింది. హైదరాబాద్ లోని రెండు స్టూడియో యజమానుల పుత్రులైన హీరోలతో ''ఈ పరిస్థితికి మీరే కారణం.'' అని మోహన్‌బాబు నిందించాడు. దాంతో మాటా మాటా పెరిగింది. కొందరు ప్రముఖులు సభలోంచి చల్లగా జారుకున్నారు. ఒక నిర్మాతతో ''మీరు ఫిలిమ్ నగర్ కాలనీలో బినామీ పేర్లతో ఎన్నో ప్లాట్లు కైవశం చేసుకోలేదా?'' అని మరొకరు గొడవ పడ్డారు.

ఆ మర్నాడు వాహినీ స్టూడియోలో శోభన్‌బాబు షూటింగ్‌లో పాల్గొంటూండగా మూవీ ఆర్టిస్ట్ సభ్యులు కొందరు ఆ షూటింగ్‌ను ఆపుచేయాలని పట్టుబట్టారు. శోభన్‌బాబు వాళ్లకు చక్కని సమాధాన మిచ్చారు. ''మూవీ ఆర్టిస్ట్ అసోసియేషన్ ఒకటుందని నాకు తెలియదు. నేను సీనియర్ హీరోని. సభ్యుడుగా చేరమని నన్నెవరూ కోరలేదు. ఇంతకాలం నేనొకడ్నున్నానని పట్టించు కోకుండా ఇప్పుడు హఠాత్తుగా నేను షూటింగ్ రద్దు చేయాలని చెప్పడానికి మీరెవరు; నన్ను నమ్మి ఈ చిత్ర నిర్మాత ఈ షూటింగ్ పెట్టుకున్నారు. అర్థాంతరంగా రద్దు చేస్తే, ఆయనకు కలిగే నష్టాన్ని ఎవరు భరిస్తారు?'' అని శోభన్‌బాబు మండిపడ్డారు.

మొత్తం మీద ఒక చిన్న సమస్య పెద్ద సమ్మెగా మారింది. దీని వెనుక అదృశ్య హస్తాలున్నా యేమోనని ఆరా తీసేవారు లేకపోలేదు. ఎన్నికలు సమీపిస్తున్న తరుణంలో ఈ సమస్య ఏమిటో, దీనికి పరిష్కార మేమిటో మీరే చూసుకోవాలి అని మద్రాసులోని కొందరు చిత్ర ప్రముఖులకు ముఖ్యమంత్రి కోట్ల విజయ భాస్కరరెడ్డి స్వయంగా ఫోన్ చేసి కోరారట''. అటు తమిళనాడు ప్రభుత్వం దృష్టికి పోవడం, ఇటు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం గౌరవం కూడా ఇందులో ఇమిడి ఉండటంతో ఈ సమ్మె ప్రాధాన్యత సంతరించుకుంది. పరిష్కార మయ్యాక నటీనటుల, సాంకేతిక నిపుణుల కాల్‌షీట్లు సమకూర్చు కోడానికి నిర్మాతలు ఎన్ని ఇబ్బందులు పడవలసి వస్తుందో, అన్నిచోట్లా ఒకేసారి షూటింగ్స్ ప్రారంభ మవడానికి విశ్వ ప్రయత్నాలు చేస్తున్నట్లు నిర్మాతల మండలి అధ్యక్షుడు దాసరి నారాయణ రావు తెలిపారు.

## తారల వీడియో కాలక్షేపం

ప్రియాహాసన్

వాలు - వీడియో క్యాసెట్లు చూడడమే పని. వయొలెన్స్ అండ్ డేర్ డెవిల్ ఫైట్సును దగ్గరగా కూర్చొని చూస్తూంటే ఎంతో థ్రిల్లింగ్‌గా ఉంటాయి. ఏ భాషా చిత్రమైనా ఫరవాలేదు. ఆ మధ్య సావిత్రి నటించిన ఓ తమిళ చిత్రం చూశాను. ఆమె నటనకు ముగ్ధురాలి నయ్యాను.

**రోజా**

అసలు నేను సినిమా నటి అవడానికి ముందే వీడియో క్యాసెట్లు లెక్కలేనన్ని చూశాను. అప్పుడు పాత్రధారుల నటనలో లీనమై

కొరవ 10 పేజీలో

సంసారపక్షంగా, చూడడానికి నిండుగా వుంది!

# ఎం. ధర్మరాజు ఎం.ఎ.

**చిత్రసమీక్ష**

గ్రిద్దలూరు గోపాలరావు

సినిమాల్లో ద్విపాత్రాభినయం కొత్త విషయమేమీ కాకపోయినా దర్శకుడు రవిరాజా పినిశెట్టి ''యం.ధర్మరాజు M.A.'' సినిమాలో ద్విపాత్రాభినయం చేసే అవకాశం మోహన్ బాబుకు కల్పించాడు. తండ్రి యం.ధర్మరాజు, కుమారుడు సత్యం పాత్రలను మోహన్ బాబు పోషించాడు.

ఈ రెండు పాత్రల్లో యం.ధర్మరాజు పాత్ర నటుడి సత్తాను పరీక్షించ గలిగిన క్లిష్టమైన పాత్ర. సత్యం పాత్ర, పోలీస్ ఇన్‌స్పెక్టర్‌కు వుండ వలసిన నీతి నిజాయితీ, కర్తవ్య సాధనలను గుర్తు చేసే పాత్ర. ఈ రెండు ముఖ్య పాత్రల మీద ఒక హీరో భుజ స్కంధాల మీద, నటనా చాతుర్యం మీద ఈ సినిమా ప్రేక్షకులను ఆకట్టుకుంటూ సాగుతుంది.

యం.ధర్మరాజు పేరులో ధర్మమున్నా అతని ప్రవర్తన అధర్మ మార్గం అనుసరిస్తుంది. ఈ అధర్మ మార్గంతోనే ఆయన అడుక్కు తింటూ వున్న అధమ స్థానం నుంచి ఎం.ఎల్.ఏ. స్థాయికి ఎదిగి పోతాడు. తన మాటల చాతుర్యంతో తొలుత తులసిని (సురభి) ప్రేమిస్తాడు. గర్భవతిని చేస్తాడు. వదిలేస్తాడు. తులసికి సత్యం పుట్టాడు.

తన మాటల మాధుర్యంతో వయసు మళ్లిన శ్రీమంతురాలిని (సుజాత) బోల్తా కొట్టించి బుట్టలో వేసుకొని పెళ్లి చేసుకుంటాడు. అన్యాయాలు, అక్రమాలు చెయ్యాలను కొన్నవారికి రాజకీయాలు బహు చక్కగా ఉపయోగ పడతాయి. యం.ధర్మరాజు రాజకీయ ఉక్కు కవచంతో చెయ్యని దురాగతం లేదు.

యం.ధర్మరాజు కుమారుడు సత్యం, పోలీస్ ఇన్‌స్పెక్టరుగా తండ్రి క్రూర చర్యలను ఎదిరిస్తాడు. ఆయన చేస్తున్న దారుణాలను అరికట్టాడు. చివరన తన విధి నిర్వహణలో యం.ధర్మరాజు తన తండ్రి అనే భావన చూపకుండా ఆయన్ను అంతే

కొరవ 10 పేజీలో

# సింహపురిలో ఉదయించిన 'సూర్య'

## ఆతిథ్య సేవలో సృష్టించింది నూతనాధ్యాయం!

## ఆదరించిన వారందరికీ అర్పిస్తుంది వందన సుమాంజలి!

ప్రథమ వార్షికోత్సవం




డిసెంబరు 8, 1994

# హోటల్ సూర్య ఇంటర్నేషనల్

ఎస్.వి.ఎస్. కాంప్లెక్స్, నెహ్రూ బొమ్మ వద్ద, నెల్లూరు. ఫోన్: 29161

హార్దికమైన ఆతిథ్యానికి నెల్లూరు పెట్టింది పేరు. ఆ పేరు నిలబెట్టే రీతిలో ప్రారంభింపబడి సంవత్సర కాలంలోనే అందరి ఆదరాభిమానాల్ని పొంది ప్రథమ వార్షికోత్సవం జరుపుకుంటున్న శుభ సందర్భంలో ఆదరించిన వారందరికీ హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటూ ఇక పై కూడా మీ సహకారాన్ని కోరుకుంటూ.

-వూటుకూరు బ్రహ్మారెడ్డి

**43** విశాలమైన గదులు, ఎ.సి. చల్లదనం, లిఫ్ట్ సౌకర్యం
కార్ పార్కింగ్, అన్నిటినీ మించి నూతన వధూవరులకు హనీమూన్ సూట్ మా ప్రత్యేకత.

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.